JAGATI Rs. 2-00. April 1989

34th Year of Publication

# జగతి

**ఎడిటర్ : చందూర్**

## ఏప్రిల్ – 1989




'22 వ శతాబ్దిలో గాలి మరల గ్రామీణ జీవితం'

—'జర్మన్ ట్రెబ్యూన్' సౌజన్యం

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్ : 76697 – చందా 2 సం॥లకు రు. 45-00. – 5 సం॥లకు రు. 100-00 జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : కరుణానిధి

# నిమ్మతొనలు

విూ అబ్బాయి అర్ధరూపాయికాసు మింగినప్పట్నుంచీ, ఆయనెవరో ఆపరేషన్ విషయమై మహా ఆత్రపడు తున్నాడు - మీ బంధువా ?' - అని అడిగాడు డాక్టరుగారు సోమ సుందరాన్ని.

'బంధువు కాదండి - ఎదురింటి గుర్మాధంగారు - ఆ అర్ధరూపాయి ఆయనిది ; ఆపరేషన్ అవగానే తీసుకు పోదామని !'

— కె నాగేశ్వర్రావు
నరసారావుపేట

ఆలస్యంగా వచ్చిన భర్త మీద సుభద్ర చిరాకు పడుతోంది.

'ఎప్పుడూ ఆలస్యంగా వచ్చే ఆ రైలెక్కి తగలడకపోతే, ప్రక్కనే ఉన్న బస్‌స్టాండ్‌కి వెళ్లి, బస్సు ఎక్కి ఏడ వచ్చుకదా ?'

తన భార్యామణి భాషకు ఆనందపడి పోయే ఆ భర్తగారు యిలా చెప్పాడు : 'ఓసి పిచ్చిమొద్దా, బస్సులో అయితే టంచన్‌గా టిక్కెట్టుకొనాలి - రయిల్లో ఆ యిచ్చేదిలేదుగా !'

— డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

ఇద్దరు స్నేహితులు తమ కుటుంబం లోని వారి మంచి చెడ్డల గురించి మాట్లాడుకుంటున్నారు.

'మా అన్నయ్య మంచివాడు'

'మా అన్నయ్య చాలా మంచివాడు'

'మా నాన్నగారు మంచివారు'

'మా నాన్నగారు ఎంతో మంచి వారు'

'మా మామయ్య మంచివాడు'

'మా మామయ్య కూడా చాలా మంచివాడు'

'మా అమ్మ ఎంతో మంచిది'

'అవును, నిజమే - మా నాన్నగారు కూడా వొప్పుకున్నారు'

— వైవి రమణ
చీరాల

నీకేగనక రెక్కలు ఉంటే ఏం చేసే వాడివి, గోపీ ?' - అని ప్రశ్నిం చాడు టీచరు సుదర్శనం.

దిక్కులు చూస్తున్న గోపీకి ధైర్యం చెబుతున్నట్లుగా 'ఏం చేసేవాడివి ?' అని మళ్లీ రెట్టించాడు.

'క్లాసులోనుంచి ఝూమ్మని ఎగిరి పోయేవాడివి, సార్' - అన్నాడు గోపీ.

— బి వెంకటేశ్వర్రావు
రుద్రారం

ట్రి వెళ్తున్నామని చూశావు కదా - చక్కగా ట్రిమ్‌గా ఉంది. ఆమె రోజూ ఎంత మందితో లేచి పోతుందో తెలుసా ?' - అని క్విజ్ యిచ్చాడు కనకారావు.

రామ్మూర్తి కాస్త మందలింపు ధోరణితో 'స్త్రీల గురించి అలా చుల కనగా మాట్లాడటం సభ్యత అనిపించ కోదు' - అన్నాడు.

'ఆమె రోజూ రెండు వందల మందితో ....'

'స్టాప్ దట్ నాన్సెన్స్' - అని గద్దించాడు రామ్మూర్తి.

'హాస్యోక్తి పలికినంత మాత్రాన ఆమె మీద నాకు గౌరవం లేదనా? విమానం గాలిలోకి లేచిన మీదట కదా పోయేది - ఆమె ఎయిర్ హోస్టెస్'

—జి మాధవీరామ్

నందిగామ

క్రట్టె, కొట్టె, తెచ్చె - అని రామాయణా నికి చెబుతూంటారు. నేటి సాంఘిక పరిస్థితులకి అనువుగా చెప్పండి మీలో ఎవరైనా ?' - అన్నాడు ధనవంతు లబ్బాయి అయిన రాంబాబు.

'చెబితే ఏమిస్తావు ?' - అని అడి గాడు శేఖర్.

'ఏం కావాలి ?'

'పదిరూపాయలు'

'ఒకె'

'గంగులు గంగి మెడలో తాళి 'కట్టె' .... కొన్నాళ్లు హాయిగా ఉన్నాక, గంగులు సారామతుతో తూలుతూ యింటికొచ్చి గంగిని 'కొట్టె.' ఆమె కోపగించి నానాల్ల పుట్టింటికి పోగా, ఒంటరితనం భరించలేని గంగులు ఆమె వద్దకు వెళ్లి కాళ్లా వేళ్లా పడి బతిమాలుకు వెనక్కి 'తెచ్చె'

—యల్ కమల

రాజమండ్రి-2

జ్ఞాపకం పెట్టుకోవడం ఒక ఎత్తు; తెలుసుకోవడం ఒక ఎత్తు. జ్ఞాపకాని కని వొప్పగించిన విషయాన్ని భద్ర పరుస్తుంది జ్ఞాపకశక్తి. తెలుసుకోవడ మనేది అలా కాదు - మీలో అంత ర్భాగమైపోతుంది. —సెనెరా







# పాఠకుల తీర్పు

డియర్ చందూర్ గారికి, మాలతీ - చందూర్ గారికి నమస్కారములు. .... అత్తకొడుకు పెళ్లికి ఢిల్లీవెళ్లి, అక్కడ నుంచి జమ్ముపెళ్లి, అక్కడ నుంచి హిమాలయాల్లో ఉన్న వైష్ణో దేవిగుడికివెళ్లి ఈమధ్యనే తిరిగి వచ్చాను. హిమాలయాల్లోని ఆ చలి, ఆ మంచు, వానలో ఆ ప్రయాణం ఒక యడ్వెంచర్ - ఒక త్రిల్.... మీ క్షేమసమాచారం, కబుర్లు 'జ గ తి' ద్వారా తెలుస్తున్నాయి. బొంబాయి జీవితం ఒక మెకానికల్ లైఫ్ అయి పోయింది - మేమంతా ఆటొమెటన్స్. మీరు బొంబయి మళ్లీ ఎప్పుడు వస్తు న్నారు ?

—వి రాధ
బొంబాయి-22

చందూర్ గారికి : ముఖచిత్రం గురించి మీరిస్తున్న వివరణ బాగుంటున్నది. ముఖ్యంగా అన్న పూర్ణారెడ్డిగారి 'మజిలీ' సీరియల్ ఎంతో ఆసక్తికరంగా ఉంది. డాక్టర్ సారధికి, ఆశ్రయము పొందిన జానకికి మధ్యనున్న అనుబంధాన్ని ఎంతో లలితంగా హృదయంగమంగా చెబు తున్నారు రచయిత్రి. వారికి నా అభి నందనలు.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

మాన్యశ్రీ చందూర్ దంపతులకు - ఉభయకుశలోపరి .... 'జ గ తి' ని దీక్షగా, ఆసక్తిదాయకంగా నిర్వహిస్తు న్నందుకు నాధన్యవాదాలు .... మీరు 'ఆకాశవాణి' లో ఒకప్పుడు పనిచేశా రని 'డైరీ' ద్వారా తెలిసింది. దంపతు లిద్దరూ పూర్వాశ్రమంలో ఆకాశ వాణి సుగంధ వాసనలు పీల్చినవారే నన్నమాట .... ఇటీవలే నెల్లూరు వెళ్లి నప్పుడు డా॥ గోపాలరెడ్డిగార్ని కలి శాను .... ఈదఫా ఢిల్లీవచ్చినప్పుడు మీరు మా యింటికి తప్పకరావాలి.

—ఆర్. ఎ పద్మనాభరావు
న్యూఢిల్లీ-1

ఎడిటర్ గారికి : కు మా రు ని ప్రశ్నకు తండ్రి సమాధానముగా, ఇంగ్లీషులో స్వధర్మ స్వారాజ్య సంఘమువారు ప్రచురిస్తున్న రామా యణ ఘట్టాలు ఎంతో రసవత్తర ముగా ఉంటున్నవి. రఘుకి కలిగే సందేహాలు, అతను ప్రశ్నించే పద్ధతి నేటి యువతలోని మనోభావాల ప్రతి రూపము. మాయింటిలోని అందరము ఆ పేజీ ప్రత్యేక శ్రద్ధతో చదువు తున్నాము.

—ఆర్ కళ్యాణి
బెంగుళూరు-1



# ప్రాచీన సాహితి



హృదయ వచశ్శరీరముల నెంతయు బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూడు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు మాన్యులు గొందరు వొల్తురిద్ధరన్

—భర్తృహరి

పాలు నీరును బోలి పడతి నాపతి నేను
గూడి యుంటిమి గదె కూర్మి గలిగి
కన్ను రెప్పయు బోలి కాంతుడు నేనును
కాగలసి యుంటిమి గదె కాంక్ష మీర
పువ్వు తావియు బోలి పురుషుండు నేనును
నెరసి యుంటిమి గదె యింపు దనర
నూనె నువ్వులు బోలి నా నాయకుడు నేను
పొంది యుంటిమి గదె పొలుపు మెరయ

నేటి కత డెవ్వడో నాకు నేను నెవతె
నతని కగుదునొ యేమందు నజుని మాయ
రామ నీ వల చెంగల్వరాయ నిటకు
దోడుకొని వేగ రాగదే తోయజాక్షి

—చెంగల్వరాయ శతకం

అకలంకౌషధ సత్త్వమున్ దెలియ మాయ ద్వారకావంతి నా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుకొం
డకు రాజెల్లునె, బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్

— పెద్దన 'మనుచరిత్రం'

# తికేళ్లనాటి పిక్చర్

## రాజ రా:   'రి
## 'చదువుకొన్న భార్య'

ఈ చిత్ర నిర్మాణంలో నిర్మాతలు కొంత మేర కొత్త ప్రయత్నంచేసి, మిగతాదంతా మామూలు ఫార్ములాలో యిమిడ్చారు. రైలులో ఆడామగా కాలేజీ పిల్లల పాట, గూడెంలో అలుక ఎందుకని అడిగే అంగనామణి పాట, మందులషాపులో చలం, పేకేటి యిత్యాదుల ఫార్సు, సూర్యకాంతం, రమణారెడ్డిల సంసారం - యిలాటి వన్నీ చూసి చూసి విసుగెత్తివున్నారు ప్రేక్షకులు.... ప్రాణరక్షణ చేసిన కుమార్‌కి (కాంతారావు) ప్రేమ భిక్ష పెట్టదలుచుకున్న ఒక లేడీ డాక్టరు జానకి (కృష్ణకుమారి), ధన సంపాదన గాక, ప్రజాసేవే వైద్యవృత్తికి పరమార్థం అంటుంది. ఆదర్శవాదమే తప్ప ప్రపంచపు రీతి నీతులు తెలియని కన్నె హృదయమది. జానకి తండ్రి జగన్నాథరావు గారింట్లో (మిక్కిలినేని) పెరిగిన రఘు (జగ్గయ్య), లౌకిక జ్ఞానం గల కథానాయకుడు. పానకంలో పుడకలా, చేతికట్టుతో ఈ కుమార్ తటస్థపడి వుండక పోతే, జానకీ రఘుల వివాహం హాయిగా జరిగి పోయివుండేది.... ఉన్నత విద్యకు రఘు విదేశాలకు వెళ్లినప్పుడు, జానకీ కుమార్‌ల ప్రణయగాథ, అయిస్ క్రీములతో ప్రారంభమై, ఆదర్శాల చుట్టూ విహరిస్తుంది, తండ్రిని కాదని, పేదరికాన్నీ ప్రేమనీ వరిస్తుంది జానకి. దారిద్ర్యానికి జంకదు - కష్టాలను లెక్కచేయదు .... స్వదేశానికి

వచ్చిన రఘు, మాలినిని (వాసంతి) పెళ్లి చేసుకుంటాడు. అయితే, అతని మనస్సులో జానకి పై అక్కసు. మనస్తత్వరీత్యా అది సమర్థనీయమే; ఆ రహస్యం భార్యకు చెప్పడు. తన గొప్పలు జానకి ముందు ప్రకటించుకుంటాడు. జగన్నాథరావు గారి అప్పులు తన కష్టార్జితంతో తీరుస్తానంటాడు ; తను ఆయనకెంతో రుణపడి వున్నానంటాడు. పైకి ఎన్ని మాటలు చెప్పినా, జానకి మీద అతనికి గల కోపం మాత్రం చల్లారదు. కుమార్ ప్రాణాపాయ స్థితిలో ఉండగా రఘువద్దకు వచ్చి, తన భర్తను రక్షించమని వేడుకుంటుంది జానకి. రఘు వైద్యం చేసేందుకు అంగీకరిస్తాడు - తన ఫీజేమిటోకూడా ఆమెకి చెబుతాడు. ఆమె వొప్పుకుంటుంది - భర్త ప్రాణాలు కాపాడుకొనేందుకు! ఆమె వొప్పుకోగానే, వివేకోదయం కలుగుతుంది రఘులో.... ఈ చిత్రంలో జానకి చేసిన ప్రజాసేవ ఏమీలేదు. ఆత్మవిశ్వాసం గల స్త్రీని సృష్టించబోయి, ఆమెని మళ్లీ 'సినిమా పతివ్రతని' చేశారు.

—యన్నార్ చందూర్
'జగతి' - ఏప్రిల్ 1965



# వెన్నెల కెరటాలు

## గంగాసింగ్

1857 మే 30 వ తేదీ అది. గంగాసింగ్ కమీషనరు ఇంటికి చేరాడు. అక్కడి లాన్స్‌లో తన అధికారి లెఫ్టినెంట్ మెకంజీ, కమీషనరు, ఇతరుల దీర్ఘాలోచనలో మునిగి ఉండటం, గంగాసింగ్‌కు ఆశ్చర్యం కలిగించింది. తిరుగుబాటు గుంపు నుంచి మా ప్రాణాలు కాపాడగలిగింది నీవేనని బ్రిటీషు యజమానులు చెప్పారు. నీవే తప్ప దిక్కు లేదన్నారు ఒక్క మాటలో. నైనిటాల్‌లో మరికొన్ని బ్రిటీషు కుటుంబాలున్నాయని, ఇక్కడి వారిని కూడా అక్కడికి తరలిస్తే, భద్రత ఎక్కువన్నారు పై అధికారులు. అంతగా చెప్తుంటే కాదనాలో లేదో అంతుపట్టకపోయినా, "సరే, మాట ఇస్తున్నాను, నేను, నాతోటి జవాన్లు, మీవారిని నైనిటాల్ భద్రంగా చేరుస్తామని" హామీ ఇచ్చాడు గంగా. ప్రయాణం మే 31న ప్రారంభమయింది. భాయిబా (అన్నగారు) ముందు, గంగాసింగ్ వెనుక, ఉండి బ్రిటీషువారిని తీసుకు వెళ్ళసాగారు. బరెల్లి వదలిపెట్టగానే నక్కలు కూశాయి. గ్రామాల మీదగా వెడుతుంటే, వీధి కుక్కలు మొరిగాయి. రాత్రి ప్రయాణం సైనికులకి కొత్త కాదు కానీ, అర్ధరాత్రి అశ్వాలని నడిపించటం భయం కలిగించింది. కన్ను పొడిచి చూచినా ఏమీ కనిపించని కారు చీకటిలో ప్రయాణం చేస్తూ, తిరుగుబాటు దారులకి ఏమాత్రం తెలియకుండా, ఆశ్విక యాత్రని నైనిటాల్ చేర్పించారు. గంగాసింగ్, భాయిబ్బాధ.... ఆవిధంగా స్త్రీలను, పిల్లలను కాపాడారు.

—లెఫ్టనెంట్ కల్నవ్ నరేన్ తివారి
'సైనిక సమాచార్'లో

## కాలీఫ్లవర్

కాలిఫ్లవర్ మనదేశంలో సుమారు 78,000 హెక్టార్ల విస్తీర్ణంలో సాగు చేయబడి సాలీన 4,70,000 టన్నుల పువ్వుతలలు ఉత్పత్తి అవుతున్నవి. మన రాష్ట్రంలో దీని సాగు విస్తీర్ణం చాలా తక్కువ. వీటి పువ్వుతలలు ఎక్కువ పోషక విలువలు కలిగి ఉండుటవలన వీటికి మార్కెట్టులో ధర బాగా పలుకుతుంది.... కాలిఫ్లవర్ శీతాకాలపు కూర పంట. ఇది సముద్ర మట్టానికి 1200 మీ. ఎత్తు గల కొండ ప్రాంతాలలోను మరియు సమతల ప్రాంతాలలోను సం॥ పొడుగునా మూడు ఋతువులలోను మే - జూన్, జూలై ఆగషు మరియు సెప్టెం

బరు - అక్టోబరు మాసాలలో సాగు చేస్తున్నారు. కొండ ప్రాంతాలలో వేసవి (మార్చి - ఏప్రిల్)లో కూడా సాగుచేయుటకు అనుకూలమైన పంట. మనరాష్ట్రంలో ముఖ్యంగా కర్నాటక సరిహద్దు ప్రాంతాలైన పలమనేరు, కుప్పం, మదనపల్లి - ఏజెన్సీ ప్రాంతాలు మరియు అరకువాలీ ప్రాంతాలలో కాలీఫ్లవర్ సెప్టెంబరు-అక్టోబరు మాసాలలో సాగుచేయబడుతుంది. వీటి ఉత్పత్తిలో కొన్ని అరిష్టాలు వాటిల్లుట వలన పువ్వుతలలు మార్కెట్‌కు ఉపయోగపడక అనుకున్న మేరకు మంచి లాభాలు పొందలేకపోతున్నాం. తగు జాగ్రత్తలు పాటించిన యెడల మన ప్రాంతాలలో కూడా దీనిసాగు లాభసాటి చేయవచ్చు.

—డా॥ ఇయన్ రెడ్డి
'అన్నదాత'లో

## తుమ్మల

శృంగారరస ప్రమేయం లేకుండా ఉత్తమ హైందవ సంప్రదాయాలకు ప్రతిబింబాలుగా, తెలుగుదనంతో కావ్యరచన చేసినవారు. ఈయన వచన రచన తిక్కనగారి వచన రచనను తలపింపజేస్తుంది. అందువల్ల 'అభినవ తిక్కన' అనే బిరుదును అచ్చమయిన తేటతెనుగుతో తెలుగు సంప్రదాయానుగుణంగా రచనలు చేయటం వల్ల 'తెనుఁగు లెంక' అనే బిరుదును తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు సార్థకం చేసుకున్నారు. 'తెనుఁగు లెంక' రచనా చమత్కృతితో అమరత్వాన్ని సంతరించుకొన్న కావ్యం 'ఆత్మార్పణము'. తుమ్మలవారి దయార్ద్ర హృదయానికిది మచ్చుతునక. సహృదయులకు ఆర్ద్రత కలిగించే సన్నివేశ కల్పనాతిశయం గల కావ్యం ఇది. తిక్కన భారతం శాంతి పర్వంలో కథాప్రధానంగా ఉన్న 'లుబ్ధక కపోతోపాఖ్యానాన్ని' ఇతివృత్తంగా స్వీకరించి ప్రబంధ శైలిలో రచించబడినది 'ఆత్మార్పణం', ఆర్తరక్షణ పరాయణత్వం యొక్క ప్రాధాన్యాన్ని తెలియచేయటానికి భారతంలో భీష్ముడి ద్వారా ధర్మరాజుకు ఈ కథ చెప్పబడింది. నీతిబోధక సూత్రం అయిన ఆ కథను 'తెలుగులెంక' చక్కని తేట తెలుగులో కరుణరస నిర్భరమైన కావ్యంగా మలచారు. నోరులేని అమాయకపు జీవులపై కాఠిన్యాన్ని చూపటం అధర్మం అని ఇందులో కవి బోధించారు. సామాన్యజనులకు కూడ దీని పరమార్థం అవగతమయ్యే విధంగా రచన సాగించి సఫలీ కృతులయ్యారు.

—లి నాగరాజ్యలక్ష్మి
'స్రవంతి'లో

---

మహనీయుల ఘనతపై విశ్వాసం వుండక పోవడంలోనే సామాన్యుల స్వల్పబుద్ధి వెల్లడవుతుంది.

—కార్లయిల్

చరిత్ర పత్రాలలోని పన్నెండుగురు గొప్పవాళ్లలో పదకొండుగురు ఏదో ఒక మహదాశయపు ప్రతినిధులు.

—విషి

## మానవ ప్రగతి

విద్యుచ్ఛక్తి సహాయంతో నీటిలోని కలుషిత పదార్థాలను తొలగించే సమర్థమైన ప్రక్రియను ఒక అమెరికన్ సంస్థ కనుగొన్నది. కొలరాడోకి చెందిన 'క్లిని అండ్ రికవరే కార్పొరేషన్' రూపొందించిన ఈ ప్రక్రియ తక్కువ ఖర్చుతో కూడుకొని వున్నది కావడం కూడా గమనార్హం. ఈ ప్రక్రియలో భాగంగా వృథా జలాన్ని 'ఎలెక్ట్రికల్ ఛార్జెస్' గల గొట్టాల గుండా ప్రవహింపజేస్తారు. ఈ ఛార్జెస్ వల్ల నీటిలోని కలుషిత పదార్థాలు ఒక ముద్దగా మారి వేరుపడి పోతాయి. ఆ తర్వాత ఈ 'ముద్దలోని' రాగి, జింక్‌లాంటి ధన విద్యుత్ గ్రాహక పదార్థాలను ఒక ఋణ విద్యుత్ క్షేత్రం తొలగిస్తుంది. అదేవిధంగా సైనైడ్ ఫ్లోరైడ్ లాంటి ఋణ విద్యుత్ గ్రాహక పదార్థాలను ఒక ధన విద్యుత్ క్షేత్రం తొలిగిస్తుంది. నీటిలోని కలుషిత పదార్థాలను వేరు చేయడానికి ఇప్పుడున్న సమర్థమైన పద్ధతులలో ఏ పద్ధతికైనా జరిగే ఖర్చులో కేవలం 10 శాతం వ్యయంతోనే ఈ నూతన ప్రక్రియను నిర్వహించ వచ్చునని వ్యోమింగ్ యూనివర్శిటీ పర్యావరణ విషయాల ఇంజనీర్ ఒకరు పేర్కొన్నారు. అదే సమయంలో - ఈ ప్రక్రియ ద్వారా నీటినుంచి బొగ్గు, చమురులాంటి కలుషిత పదార్థాలను 99 శాతం మేరకు తొలగించి వేయ వచ్చునని కూడా అయన తెలిపారు. ఈ ప్రక్రియ ద్వారా ఇప్పటికే డెన్వర్, కొలరాడోలలో వృథా జలం నుంచి క్రొవ్వు పదార్థాలను, ఇతర కలుషిత పదార్థాలను వేరు చేస్తున్నారు.

### ఆకలి

ఆకలి బాధను ఎదుర్కొంటున్నది కేవలం పేద వర్ధమాన దేశాలు మాత్రమే కాదు. అమెరికా లాంటి సంపన్నదేశంలో కూడా ఆకలి విలయ తాండవం చేస్తోంది. అమెరికాలో సైతం పస్తులుండేవారు ఎంతోమంది వున్నారు. 'వరల్డ్ మేగజైన్' (న్యూయార్క్) కథనం ప్రకారం అమెరికా జనాభాలో 40 శాతం మంది దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. ప్రతి నలుగురు పిలలలో ఒకరు తినడానికి

తిండిలేక డొక్కల్లో కాళ్లుపెట్టుకుని సొమ్మసిల్లి పడుకుంటున్నారట. భారీ సైనిక ఖర్చుల మూలంగా, సంపన్న దేశమైన అమెరికా రుణగ్రస్త దేశంగా మారిపోయింది. అమెరికాలో సామాజికావసరాలమీద పెట్టే ఖర్చులో పెద్ద ఎత్తున కోత విధించడం జరుగుతోంది. గడిచిన ఐదు సంవత్సరాల కాలంలో ఆకలి బాధకు తట్టుకోలేక అమెరికాలో మరణించిన పిల్లల సంఖ్య వియత్నాం యుద్ధంలో అమెరికాకు సంభవించిన ప్రాణనష్టంకన్నా ఎక్కువ అని అమెరికన్ చిల్డ్రన్స్ డిఫెన్స్ ఫండ్ పేర్కొంది. ఈ లెక్కన అమెరికా, నక్షత్ర యుద్ధాల పథకాన్ని అమలుజరిపితే, ఎన్నివందల బిలియన్ల డాలర్లు ఖర్చు అవుతుందో? శిశు మరణాల రేటును బట్టి దేశంలో సాధారణ ఆరోగ్య పరిస్థితి ఎలా ఉందో చెప్పవచ్చు. ఇతర పారిశ్రామిక దేశాలలో కన్నా అమెరికాలో పరిస్థితి దారుణంగా వుంది. ఒక్క వాషింగ్టన్‌లోనే నల్లజాతి వారి శిశువులలో మరణాల రేటు ఎక్కువగా వుంది. పిల్లల ఆరోగ్యం తలి దండ్రుల ఆదాయాలమీద ఆధారపడి వుంటుంది. ఆకలి అనేది ఒక అంటువ్యాధిలాంటిది. ఈ అంటు వ్యాధికి కారణాలు వున్నాయి. దారిద్ర్యరేఖకు దిగువన జీవించే ప్రజల పట్ల ప్రభుత్వం తగిన శ్రద్ధ చూపక పోవడం, ఆర్థికవ్యవస్థ కుంటుపడటం వల్ల ప్రజల సంక్షేమం క్షీణించడం, ఆ దేశ ప్రభుత్వం అనుసరించే సామాజిక విధానాలు, క్షుద్బాధకు కారణాలుగా పేర్కొన వచ్చు. ఉన్మత్తతతో కూడిన ఆయుధపోటీ మూలంగా లక్షలాదిమంది ప్రజల జీవన ప్రమాణాలు దెబ్బతింటున్నాయి. వాగాడంబరంతో కూడిన నినాదాలతో కాక విస్తృతస్థాయిలో నిర్దిష్టమైన కార్యాచరణ ద్వారా ప్రపంచ దేశాలు క్షుద్బాధను తీర్చవచ్చు. ప్రపంచంలోని అధికప్రాంతంలో మానవ జీవితానికి యోగ్యమైన కనీస ప్రాథమిక అవసరాలు కూడా లేనప్పుడు, లక్షలాదిమంది ప్రజలకు ఆకలితో అలమటించినంత కాలం, తలదాచుకొనేందుకు కొంపాగోడు లేనంతకాలం, ఉద్యోగాలు లేనంతకాలం, నిరవధికంగా అనారోగ్యంతో బాధపడుతున్నంత కాలం ఆ ప్రపంచంలో భద్రత వున్నదని భావించడానికి వీలేదు.



### నెహ్రూవాణి

స్వాతంత్ర్యమనేది రాజకీయ నిర్ణయాలకు, రాజ్యాంగ సూత్రాలకు చెందినది కాదు; ఆర్థిక విధానాలకు సంబంధించినది కాదు. పొగమంచుతో మనసు సంకుచితమైన కొద్దీ, హృదయం అసహనమూ ద్వేషమూతో నిండిపోయి, స్వాతంత్ర్యం కరువవు

1948 ఆగస్టు 15



# మన రైల్వేలు

ప్రపంచ రైల్వేలలో రెండవ స్థానాన్ని ఆక్రమించిన భారతీయ రైల్వేలు స్వయం సమృద్ధితో సాంకేతికాభివృద్ధితో తమ విజయగాథను వినిపిస్తున్నాయి. వ్యవసాయ ప్రణాళికలను విజయవంతము చేయడానికి ఎరువులు, మేలురకము విత్తనాలు ఒక ప్రాంతము నుండి ఇంకో ప్రాంతానికి చేరవేయటంలో ఆ ఆహార ధాన్యాలు అధికంగా పండిన ప్రాంతాల నుండి వాటి ఉత్పత్తి తక్కువగా ఉన్న ప్రాంతాలకు పంపటంలో రైల్వేలు తమ కర్తవ్యం నిర్వర్తించాయి. ఒకనాటి రైల్వే వ్యవస్థలో దిగుమతి చేసుకొన్న ఆవిరి ఇంజన్లు, చెక్కతో నిర్మించిన రైలు పెట్టెలు, 4 చక్రాల వ్యాగన్లు మాత్రమే ఉండేవి. ఈ దశలో 1950 - 51లో చిత్తరంజన్‌లో స్థాపించిన లోకొమోటివ్ కర్మాగారము, భారతీయ రైల్వేలు స్వయం సంవృద్ధికి వేసిన మొదటి అడుగు. పది సంవత్సరాలలోపునే అక్టోబరు 14, 1961లో పండిత నెహ్రూ ప్రారంభించిన డిసి విద్యుత్ లోకోమోటివ్ 'లోకమాన్య' రైల్వే రవాణా వ్యవస్థను నూతన శకంవైపు తీసుకువెళ్లింది. ఈ 'లోకమాన్య' ను చిత్తరంజన్ లోకొమోటివ్ కర్మాగారము నిర్మిస్తుంది. ఏసి విద్యుత్ లోకొమోటివ్ "విధాన్" ను నిర్మించడంద్వారా చిత్తరంజన్ కర్మాగారము భారతదేశంలో 25 కెవి ఏసి విద్యుత్ లైనుకు శ్రీకారము చుట్టింది. చిత్తరంజన్ కర్మాగారము తన విజయ పరంపరలను కొనసాగించటం వల్ల దిగుమతి చేసుకోబడే విద్యుత్ రైలు ఇంజన్లు సంఖ్య 90 శాతము నుండి 8 శాతానికి పడిపోయింది. ప్రయాణీకుల రైళ్ల కోసం ఇంజన్లు, 4500 టన్నుల భారాన్నిలాగే సరుకు రవాణా కోసం ఇంజన్లను చిత్తరంజన్ కర్మాగారము ప్రవేశపెట్టగలిగింది. ఈనాడు దేశములో అత్యంత వేగముతో 140 కి. మీ. గంటకు చొప్పున పయనించే ఎక్స్‌ప్రెస్‌ను చిత్తరంజన్ కర్మాగారము నిర్మించింది అనే విషయం ఎంతో గర్వించతగినది. గంటకు 160 కి. మీ. వేగముతో పయనించగల రైల్వేఇంజన్లు నిర్మాణానికికూడా ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. 1963 డీజెల్ ఇంజన్లను వారణాసిలోని రైల్వే డీజెల్ ఇంజన్ల కర్మాగారము నిర్మించింది. ఒక శతాబ్దముపాటు విదేశాల నుండి రైల్వే ఇంజన్లు దిగుమతి చేసుకొంటూ కొనసాగిన భారతీయ రైల్వే ఈనాడు స్వయంగా నిర్మించుకొన్న రైల్వేఇంజన్ల ద్వారా ప్రపంచ రైల్వేలలో రెండవ స్థానాన్ని ఆక్రమించుకోవడం మన ప్రగతికి చిహ్నం.

******************

కక్ష తీర్చుకోవలసిన సమయంలో, తగిలిన గాయాన్ని మరచి క్షమించబూనినప్పుడు, మానవునిలోని ఆత్మ, చైతన్య దీప్తి, నొందుతుంది.

— చాపిన్


క్రేన్
క్రేన్
క్రేన్


అతి రుచికరమైనది
క్రేన్
వక్కపొడి
దీనికిసాటి మరొకటిలేదు


CRANE
CRANE
CRANE

హస్తభూషణం కాదు

# పుస్తకం

## యన్నార్ చందూర్

ఒకప్పుడు 'పుస్తకం హస్తభూషణం' అనే వారుగాని ఈనాడు ఆ మాట ఆమోదకరం కాదు. ఎవరింటికైనా వెళ్తే వారి ముందు హాలులోని పుస్తకాలని బట్టి యింట్లో వున్న వ్యక్తుల అభిరుచి తెలుసుకోవచ్చు. మిత్రులని బట్టి ఎదుటి మనిషి స్వభావం తెలుసుకోవచ్చునన్నట్లే, చదివే పుస్తకాలని బట్టి కూడా చాలా మేర తెలుసుకోవచ్చు.

విద్య నిగూఢ గుప్త మగు విత్తము, రూపము, యశస్సు, భోగకరి, నృపాల పూజితము, విదేశ బంధువు - అని విద్య గురించి భర్తృహరి చెప్పినవన్నీ, ఈనాడు మంచి పుస్తకానికీ, పుస్తక పఠనకీ అన్వయిస్తాయి. పుస్తకాల ద్వారా, ఒకే మాదిరి రచయితలను యిష్టపడటం ద్వారా, పరస్పర మైత్రి పెరగడమనేది మనందరికీ అనుభవంలో ఉన్న విషయం.

ప్రపంచంలోని సమస్త సాహిత్యం మొదట్లో శ్రావ్యరూపాన వుండి, లిపి సంతరించుకున్నాక గ్రంథస్థ మయింది. 'మనుచరిత్ర' రచించిన అల్లసాని పెద్దనగారు సైతం, మనోభావం గ్రహించగల లేఖకులు, తప్పొప్పులు చెప్పగల పాఠకోత్తములూ కావాలన్నారు. అన్నమాచార్యుని కీర్తనలు రాగిరేకుల మీదకైతే, ప్రబంధాలు తాళ పత్ర గ్రంథాలుగా పండితుల సొమ్మయి వుండేవి; పామరులు పౌరాణికులు చెప్పే కథలువిని ఆనందిస్తూండేవారు.

జర్మనీలో గెటన్‌బర్గ్, ఇంగ్లండులో కాక్స్‌టనూ అచ్చుయంత్రాన్ని వ్యాప్తిలోకి తీసుకు రావడంతో పండితుల సొత్తు అయిన పుస్తకం ప్రజల మధ్యకి వచ్చింది. ఇంచుమించు అన్ని భాషలలోనూ వెలువడిన మొదటి అచ్చు పుస్తకం బైబిలు - మన తెలుగులోనూ అంతే! అక్షరాస్యతకీ, విద్యా వ్యాప్తికీ క్రయిస్తవ మిషనరీలు ఎంతో కృషి చేశారు. ఒక మెకంజీని, ఒక బ్రవున్‌నీ తెలుగు జాతి మర్చి పోగలదా ?

తాళపత్ర గ్రంథాలను పరిష్కరింపజేసి, వాటిని అచ్చుపుస్తకాలుగా ప్రజలకందించిన ఘనత వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారిది; స్త్రీలు పాడుకొనే పాటలను, నీతి బోధకమైన శతకాలను మరి కొందరు ప్రకాశకులు

అచ్చువేశారు. 19 వ శతాబ్ది ముగిసే నాటికి తెలుగులో అచ్చు పుస్తకాలు అధికంగా వెలువడ్డాయి ; అమితంగా ప్రజాదారణ పొందాయి. అచ్చులో అబద్ధం ఉంటుందా అనుకొనేవారట అనాటి అమాయకులు.

తెలుగు పాఠకుని ఆధునిక భావాలకు, వైజ్ఞానిక ప్రగతికి చేరువగా తేవాలని భారీ ఎత్తున ప్రయత్నించిన మహనీయులు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు - విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి ద్వారా ! ఎప్పుడంటారది ? ఎనభై ఏళ్ల క్రితం ! కారణాలేమయితేనేం, ప్రయత్నం ఫలించలేదు. ఆ తర్వాత ఆంధ్ర పత్రికా గ్రంథామాల, వేగుజుక్క గ్రంథమాల, సరస్వతీ గ్రంథమాల, ఆంధ్ర ప్రచారిణి గ్రంథమాలల వంటివి సామాన్య ప్రజానీకంలో మంచి పుస్తకాలు చదవాలనే ఆసక్తిని రేకెత్తించాయి. సాధారణంగా గ్రంధమాలలు చందాదారుల మీద, రాజ పోషకులు, మహారాజ పోషకుల మీద ఆధారపడుతూండేవి. పాశ్చాత్య ఖండంలో బుక్ క్లబ్స్ ఇప్పటికీ ప్రముఖస్థానంలో ఉన్నాయి - మన తెలుగులో అనేకానేక కారణాల వల్ల అవి నిలదొక్కుకో లేక పోయాయి.

మంచి పుస్తకాలు చదవడం వల్ల మనసు విశాలమవుతుందనీ, మెదడుకి చురుకుతనం వస్తుందనీ, పఠనాసక్తి మనషుల్ని వివేకవంతులుగా వేస్తుందనీ, సామాజికాభ్యుదయానికి పుస్తకాలంతగా దోహదకారి అయేది మరొకటి లేదనీ చెప్పడమనవసరం. పుస్తకమనేది ఎవరికి వారు సేవించే టానిక్ - బలవర్ధ ఔషధం, ఎటువంటి పుస్తకం టానిక్‌లా పని చేస్తుంది ? ఉద్రేకపరిచేవి గాక ఉపశమన కలిగించేవి. 1935 లో యల్లెన్ లేన్, వంద పౌనులు మాత్రమే పెట్టుబడితో, మంచి పుస్తకాలు తక్కువ ధరకి, సామాన్యుల కందుబాటులో ఉండేటట్టు తేవాలని, పది పెంగ్విన్ వెలువరిస్తూ ముందు మాటగా యిలా అంటాడు : 'Not to deal in books which contaminate the mind with sensation' - మనసుని ఉత్తేజ పరిచి చెడగొట్టే పుస్తకాలు మా సంస్థ వేయదు - అని హామీ యిస్తాడు యలెన్ లేన్ ; పెంగ్విన్స్, పెలికన్స్ గురించి వినని ఆంగ్ల పాఠకుడు ఉండడు.

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీకి చేరువగా బ్లాక్ వెల్ బుక్ షాప్ ఉన్నదట. 1979 లో శత వార్షికోత్సవం జరుపుకున్న ఈ పుస్తక విక్రయ శాలలో రెండు లక్షల టైటిల్స్ ఉన్నాయట. బ్లాక్ వెల్ లోని మొత్తం ఉద్యోగుల సంఖ్య 622 - అందులో నాలుగు వందలమంది కేవలం పుస్తకాల బంగీలు పంపే మెయిలింగ్ సెక్షన్‌లో పని చేస్తారు. సాలీనా 8 కోట్ల పౌనుల టర్నోవరు గల ఈ కంపెనీవారు 86 దేశాల కరెన్సీని అందుకుంటూంటారు. పాత సంప్రదాయాలు అతిక్రమించకుండా బ్లాక్

వెల్ కుటుంబ సభ్యులే ఈ మహా సంస్థను నిర్వహిస్తున్నారు.

మొన్నీ మధ్య, అంటే 1988 జూన్‌లో ఇంటర్నేషనల్ పబ్లిషర్స్ అసోసియేషన్ కాంగ్రెస్ జరిగింది లండన్ నగరంలో. దానినే ఐపిఎ కాంగ్రెస్ అంటారు - 1992 నాటి సమావేశం న్యూఢిల్లీలో జరుగుతుంది; 130 మంది వక్తలు ఈ కాంగ్రెస్‌లో పాల్గొన్నారు: ఈజిప్ట్ అధ్యక్షుని భార్య అయిన సుజన్ని ముబారక్ ఈ సమావేశంలో పాల్గొని, పిల్లల పుస్తకాల విషయమై తీసుకోవలసిన జాగర్తల గురించి చెప్పాడు. - ఈజిప్టులోని పిల్లల పుస్తక సంస్థకు ఆమె రాలు.

పెంగ్విన్యూ, బ్లాక్ వెలూ, ఐపిఎ కాంగ్రెస్ - వాటి గురించి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, తెలుగులో పుస్తక ప్రచురణ పాఠకుల కోసంగాక లైబ్రరీ అమ్మకాల కోసం జరుగుతోంది. ఆ లైబ్రరీ స్కూలుది కావచ్చు, కాలేజీది కావచ్చు, పంచాయితీది కావచ్చు, జిల్లాసంస్థది కావచ్చు, ఎవరిదైనప్పటికీ, పుస్తక విక్రేతలు చెప్పే విష వలయం గురించి వింటూంటే, తెలుగు సరస్వతికి యిటువంటి దుర్గతి పట్టిందా అని అనిపించక మానదు.

పుస్తకాలు సాధారణంగా ఏజ్ గ్రూప్‌ని బట్టి విభజిస్తారు. పది పన్నెండేళ్లు వచ్చేదాకా సాహసమూ అద్భుత రసమూ కావాలి ; ఆపైన ప్రణయానురక్తి, ప్రేమోపాసనం ముప్ఫయ్యేళ్లు వచ్చేసరికి చదివే పుస్తకాలలో సత్సంప్రదాయమూ, సచ్ఛీలత ఉండాలనుకుంటారు. నలభైఅయిదు దాటాక అధ్యాత్మికత వైపుగా దృష్టి పోతుంది. అందరూ అదేవిధంగా ఉంటారని కాదు - స్థూల ప్రమాణమది.

చీకట్లో దారి చూపేది పుస్తకం; అందరూ వొదిలేసినప్పుడు ఆదుకొనేది పుస్తకం; గుండె చెరువైనప్పుడూ, మనసు బరువైనప్పుడూ నేనున్నానని ధైర్యమిచ్చేది పుస్తకం. దూర తీరాలకు మనని భద్రంగా తీసుకుపోయే ఓడవంటిది పుస్తకం. అని ఎమిలీ డికెన్సన్ అనగా, ఈ పుస్తకాలలో కొన్ని రుచి చూడ దగ్గవి, కొన్ని మింగేయవలసినవి, మరికొన్ని నమిలి జీర్ణించుకోవలసినవి, - అంటాడు ఫ్రాన్సిస్ బేకన్. ఏ తరహా పుస్తకం ఎన్నుకుంటారో అది మీ ఇష్టం.

("ఆకాశవాణి" సౌజన్యంతో

---

నింద వేయడం అబద్ధం చెప్పడం కంటె ఘోరం - అది అబద్ధాన్ని దాచే బురఖా. —పోప్

గొప్పదన మెప్పుడూ నిరాడంబరతని పోలివుంటుంది - ఈ రెండిటి మధ్యా గల దూర అతిస్వల్పం.

—ఎమర్సన్

కుటిల మనస్కులు తమ తప్పులని తమ నుంచీ, యితరుల నుంచీ కుడా దాస్తారు. సజ్జనులు మాత్రమే తమ తప్పులు బాహాటంగా అంగీకరించ గలుగుతారు. —లారో.

1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం



అమెరికాలోని పదమూడు వలసలూ మాతృదేశమైన బ్రిటన్ నుంచి విడిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి. అయితే ఆయా వలసల ప్రతినిధులందరూ ఒక మాట మీద ఉంటే, భిన్నాభిప్రాయం లేని ఏకగ్రీవ తీర్మానమైతే, తమ స్వాతంత్ర్య పోరాటానికి బలం చేకూరుతుంది - అజేయమవుతుంది...

ఇక చదవండి

"ఇళ్ళూ పొలాలూ, విలువకట్టి ఆ ప్రకారము ఆ వలసకిగల ఆర్థిక సంపదను నిర్ణయించవచ్చు. ఇళ్ళూ పొలాలే సిసలైన సంపద" అన్నాడు రెవరెండ్ విదర్స్పూను.

"ప్రజల సంఖ్యని బట్టి ఆ రాష్ట్రానికిగల సంపదనిర్ణయించాలి - ప్రజలే కొలమానం. ఇళ్ళూ పొలాలూ కాదు" అన్నాడు యాడమ్స్.

"సంపదని బట్టి పన్నులు - జనాభాని బట్టి ప్రాతినిధ్యం" అన్నాడు జేమ్స్ విల్సన్. అప్పుడు నీగ్రోలను ఏ ప్రకారము లెక్కించడమనే సమస్య వచ్చింది. "పన్నుల కొరకని జనాభా అంచనా వేస్తున్నపుడు, బానిసలని లెఖ్ఖలోనికి తీసుకోకూడదు" అన్నాడు ఒక దక్షిణ కరోలినా ప్రతినిధి.

"ప్రజలు అనగానే వారు స్వతంత్రులైనా, బానిసలైనా ఒకటే. ఇరువురూ ఆ రాష్ట్రానికి సంపదేగదా!" అన్నాడు యాడమ్స్.

"అబ్బే, బానిసలచేత పనిచేయించడం ఎంత శ్రమో ఎంత ఖర్చో మీకేం తెలుసు?" అన్నాడు హారిసన్.

"అలానా, నాకు తెలియదు, బానిసత్వం వల్ల, బానిసలని వినియోగించడము వల్ల సరుకుల ధర అదుపులో వున్నదనీ, వాటినే స్వతంత్రులు పండించవలసి వస్తే ధరలు పెరుగుతాయనీ వినికిడి" అన్నాడు విల్సన్.

"అయితే ఇద్దరు బానిసలని ఒక స్వతంత్రునిగా లెఖ్ఖ వేసుకుందాము. ఒక స్వతంత్రుడు ఒక బానిస చేసిన పనికి రెట్టింపు చేయగలుగుతాడు" అని రాజీ పద్ధతి సూచించాడు హారిసన్.

ఈ విషయాల గురించి ఏ నిర్ణయానికీ రాకుండా, తెగవాదించుకోవడము మొదలుపెట్టారు. "స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించడానికి పూర్వము వలసల సమాఖ్య విషయమై మన మొక నిర్ణయానికి వచ్చి తీరాలి" అన్నాడు చిరాకు పడుతున్న హ్యూస్.

"కొలిమిలో యినుప ఖడ్డీలు పెట్టాము, అందులో కొన్ని అయినా ఎర్రగా కాలకపోవు" అని బ్రాక్స్టన్.

"ఇదే అదను, ఈ సమయం దాటిందా మళ్ళీ ఇటువంటి మంచి సమయము చిక్కదు. ఈనాడు మనమీ సమస్యలని పరిష్కరించ లేకపోతే, ముందు తరాలవారు మాత్రము ఎలా పరిష్కరించ గలుగుతారు ? వారికి మాత్రము అసూయా ద్వేషాలూ, క్రోధా వేశాలూ, ప్రాంతీయాభిమానాలూ వుండవా ?" అని కంచు కంఠంతో ప్రశ్నించాడు రెవరెండ్ విదర్ స్పూన్.

మధ్యాహ్నము ఒంటిగంట అయిందీ. విరామ సమయ సూచన చేశాడు హాన్ కాక్. ప్రతినిధులు 'అమ్మయ్య' అనుకుంటూ లేచారు.

బురదగా వున్న వీధిలో పాదము పెట్టబోయే ముందు కొంచెము సేపు కబుర్లలో పడ్డారు ప్రతినిధులు. వాతావరణం, భోజనశాలలోని ఆహారము, తమ 'అనారోగ్యము, ఎంతకీ తెమలని చర్చలూ' శుష్క వాదంలోని కాల యాపన - వీటి గురించి ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు. మాక్కిన్‌ని వెతుక్కుంటూ జాన్ యాడమ్స్ వచ్చాడు. సీజర్ రోడ్నీ కోసం కళ్ళు కాయలు కాచేటట్లు చూస్తున్నాడు మాక్కిన్.

"ఇంకా ఏ కబురూ తెలియలేదు" అన్నాడు మాక్కిన్ యాడమ్స్‌తో కొంచెము వ్యథ చెందుతూ. ఈ చర్చ తీర్మానానికి రాకుండా ఎంతకాలము పొడిగించడానికి వీలవునో అంత వరకూ పొడిగించడమే తప్ప చేయ గల దేమీ లేదు. ప్రస్తుతానికి, యాడమ్స్ మాక్కిన్ వైపు తిరిగి "రా, భోంచేసివద్దాము" అన్నాడు, ఇరువురూ ఫౌంటెట్ టావరిన్‌కి వెళ్ళారు.

కార్యదర్శి తామ్సన్ 'లాబీ' లోకి వచ్చాడు - విల్సన్ అతని వెనుకనే వున్నాడు డాక్టర్ ఫ్రాంక్లిన్‌తో. సంప్రదించడానికి వారొచ్చారు. 'ఆరుదేశాల నాయకుల' తో సంప్రదింపులు జరిపేందుకు వచ్చారు డాక్టర్ ఫ్రాంక్లిన్, విల్సన్‌లు. ఆ ఆరుగురు నాయకులూ గడిచిన కొద్ది వాగాలుగా కాంగ్రెస్ వారికి అతిథులు.

"వారిని తప్పకుండా పిలవవలసినదే కాని తీర్మానము సంగతి తెమిలిన మీదట పిలుద్దాము" అన్నాడు డాక్టర్ ఫ్రాంక్లిన్. ప్రస్తుతానికి వారిని వెలుపలనే వుంచి, వారు తమ పక్షమే నన్నట్లు కనిపింప జేయడము రాజనీతి లక్షణమని భావించాడతను. జఫర్‌సన్, ఫ్రాంక్లిన్ వెంట బయలుదేరాడు. ఇండియన్‌ల గురించి జఫర్‌సన్‌కి బాల్యము నుంచీ తెలుసు.

ఈ ఆకస్మిక రాకకు ఆ ఆరుదేశాల నాయకులు ఎంతో సంతోష పడ్డారు. డాక్టర్ ఫ్రాంక్లిన్, జఫర్‌సన్ వారికి ప్రస్తుత రాజకీయ వాతావరణాన్ని విశదపరిచారు.

"సోదరా, మన మిప్పుడు ఒక శక్తిమంతమగు దేశంతో యుద్ధానికి తలపడుతున్నాము. మా తాత ముత్తాతలైన ఆంగ్లేయులు నీటి నీలానికి ఆవలనున్న ఒక్క చిన్న దీవిలో నివసించేవారు. అక్కడ చోటు చాలక ఇక్కడకివచ్చి స్థిరపడ్డారు. మేము

అర్భకులుగా వున్నంత,కాముల వారు మమ్మల్ని, యిక్కడి సిరి సంపదలు తమ దేశానికి తర్లింపుకు వెళ్లేందుకు ఉపయోగింపుకున్నారు. అంతటితో తృప్తిపడక మేము వారి బానిసలమనీ, వారు చెప్పినట్లు మేము నడుచు కోవాలనీ ఆజ్ఞాపించసాగారు. మీరు ఎటువంటి స్వతంత్రులో, మేమూ అటువంటి స్వతంత్రులమే; మేము మీకు బానిసలు కాదలచుకోలేదు, స్వతంత్రులుగానే జీవించదలచుకున్నా మని అన్నాము. అలా అన్నందుకు గాను మాపై కత్తికట్టి యుద్ధం ప్రక టించారు.''

ఒంటి గంటకు ప్రతినిధులు తిరిగీ సమావేశమందిరానికి చేరుకున్నారు. హెన్రీ లీ తీర్మానముపై ప్రతినిధుల కడపటి నిర్ణయం తీసుకోవాలి. ఈ సమస్య ఇటో అటో తేలాలవి ఆదుర్దా పడినవారు ఆ రానున్న ప్రతినిధి ఎటు వైపు మొగ్గుతాడోనని కుతూ హల చిత్తులై వున్నారు. స్వాతంత్ర్య దీక్షాపరుడైన హంకాక్ జాప్యం చేసేందుకు ఎన్ని మార్గాలున్నాయో అన్నీ వెతుకుతున్నాడు. ప్రతినిధులు వాదోపవాదాలు సాగిస్తుండగా మాక్కీన్ మొఖంలోకి ప్రశ్నార్థక దృక్కులు విసురుతున్నాడు జాన్ యాడమ్స్. ఆ సీజర్ రోడ్నీ యింకా ఎప్పటికి దిగుతాడు ?

మధ్యాహ్నము వొంటిగంటకి సీజర్ రోడ్నీ విల్ మింగ్టను చేరుకున్నాడు. అక్కడ స్థిరపడివున్న డచ్‌వారూ, స్వీడులూ ఈ సీజర్ రోడ్నీ ఆకారము

చూసి ఆశ్చర్యపోయారు. బురదతోను, మట్టికొట్టిన బట్టలతోనూ ఏదో ఏక లక్ష్యంతోనూ దౌడు తీస్తున్న ఈ రౌతుని చూసి, నోట మాటరాక నిల బడిపోయారు. తుపాను కారణంగా జరిగిన ఆలస్యాన్ని, గుర్రాన్ని మరింత వేగముగా పరుగెత్తించి భర్తీ చేయ డానికై పూనుకున్నాడు సీజర్ రోడ్నీ. కాన్ఫెడరేషను విషయములో ప్రతి నిధులు రెండు ప్రధాన విషయాల్లో అంగీకారము తెలిపారు. పన్నులూ ప్రాతినిధ్యమూ యీ రెండూ ప్రధాన సమస్యలై కూచున్నాయి. పశ్చిమ ప్రాంతాలకు చెందిన భూములపై విధించే పన్నుల విషయములో ఎలిజ బెత్ రాణి కాలంలో ఏర్పాటైన విధానమే అమలులో వుండాలన్నారు కొందరు. తక్కువ పన్నుల విధానము దక్షిణ సముద్రము వరకూ పసిఫిక్ సముద్రము వరకూ వ్యాపించాలనీ పశ్చిమ రాష్ట్రాల ఎల్లలు నిర్ధీతము కానవరము లేదనీ కొందరు అన్నారు. రాష్ట్రాలు తమ యిచ్చవచ్చిన రీతిని పొలిమేరలు పెంచుకోరాదనీ ముందు ముందు రెడ్ ఇండియన్‌ల వద్ద నుంచి భూములు కొనుగోలు చేసే విషయ ములో కేంద్రాధికారపు అజమాయిషీ వుండాలనీ మరికొందరు వాదించారు.

భూమి విషయమలా వుండగా రెడ్ ఇండియనుల గురించినది మరొక సమస్య అయింది. రెండు లక్షల మంది రెడ్ ఇండియనులు వలసలలో వున్నారు. వారిపై కాంగ్రెస్ సభకు చట్ట రీత్యా అధికారము వుంటుందా? వారితో జరిపే వర్తక వ్యాపారాలన్నీ కాంగ్రెస్, శాసన రీత్యా కట్టుదిట్టాలకు లోను చేస్తుందా? ఇవి మరి కొందరు ప్రతినిధులను వేధించే సమస్యలు. మధ్యాహ్నము గడుస్తున్న కొద్దీ ప్రతి నిధులకు చిరాకు పుడ్తోంది. జాన్ యాడమ్స్ ఒక్క తడవ నిలబడి చుట్టూగల ప్రతినిధులను వీక్షించాడు. చాలామంది, వాదనలు విని విని విసుగెత్తి వున్న వారవడంచేత తమ స్వంతపనులు చూసుకుంటున్నారు. కొందరు వుత్తరాలు రాసుకుంటు న్నారు. మరికొందరు పేపర్లు చదువు కుంటున్నారు. జరుగుతున్న చర్చపై ఎవ్వరికీ అసక్తి కనపడటంలేదు. మాక్కీన్ వెలుపలికి వెడుతున్నాడు, లోనికి వస్తున్నాడు. ఒకటే ఆదుర్దా - ఆరాటం. డేలవార్ నుంచి యింకా ఎప్పటికొస్తాడు ఆ సీజర్ రోడ్నీ?

సీజర్ రోడ్నీ కోసమై సభవారు ఎదురు చూసి చూసి విసుగెత్తి పోయి వున్నారు. నాలుగు గంటల వేళ హాన్ కాక్ అధ్యక్షపీఠాన్ని హారిసన్‌కి వొప్ప గించాడు. ప్రతినిధుల సభ కమిటీగా మారింది. వోట్ల లెక్కింపు తీసుకునే ముందు హెన్రీ లీ తీర్మానం ఒక్క సారి చదవమని కార్యదర్శిని కోరాడు హారిసన్.

థామ్సన్ తన జర్నల్ లోని పేజీలు తిరగవేసి జూన్ ఏడవ తేదీ నాటి హెన్రీ లీ తీర్మానము చదువ నారంభించాడు. ప్రతి మాట తూచి నట్లుగా, అతి గంభీరముగా, సామ్రా జ్యాన్ని ఛిన్నాభిన్నము చేయగల

# కయ రోగంతో పోరాడండి

1 రెండు వారాలకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు

2 మీ సమీప మండలి ప్రాదమిక ఆరోగ్య కేంద్రం డి స్పెన్సరీ లేక టి బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి



3 నిర్ధారిత సమయం వరకు, క్రమంగా, డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే, క్షయ రోగాన్ని నయం చేయవచ్చు.

4. చికిత్స కంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బి.సి.జి టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి.జి.హెచ్.ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు, న్యూ ఢిల్లీ 110002

davp 88/729 TEL

మూడు క్లాజులు వరసన చదివాడు. మాతృ దేశముతో సమస్త బాంధవ్యాలూ తెంచేసుకు సర్వ స్వతంత్రముగా వలసలు రూపొందాలనీ, ఒక సమాఖ్యగా ఏర్పడాలనీ పరప్రభుత్వాలతో సంధి సంభాషణలు తమకు లాభ దాయకమగు రీతిని జరుపుకోవాలనీ - ఈ మూడు ముఖ్యమైన క్లాజులు చదివాడు.

మాక్కీన్ సమావేశ మందిరం నుంచి మళ్ళీ వెలుపలికి వెళ్ళాడు. ప్రభుత్వ భవన సింహద్వారము వద్దకు వెళ్ళి, అన్వేషణా చింతనతో చూస్తున్నాడు. రోడ్నీ ఒక్క వోటూ చరిత్ర మార్పించేటంతదిగా వున్నది ఈ క్షణంలో. దూరము నుంచి గుర్రపు డెక్కలశబ్దము వినిపించింది. గుర్రము మీద స్వారీ చేస్తూ వచ్చిన రౌతుని కళ్ళార్పకుండా చూశాడు మాక్కీన్. భగవంతుడే పంపినట్లుగా వుంది ఈ కడపటి క్షణాన. తుపానుకు తడిసి బురద బట్టలతో గుర్తు పట్టలేనట్లుగా వున్నాడు ఈ డెలవార్ ప్రతినిధి. ప్రభుత్వ భవనము ఎదుట గుర్రము మీద నుంచి కిందకిదూకి, తుపాను వల్ల అలస్యమయిందని సంజాయిషీ చెప్పుకున్నాడు. మాక్కీన్ 'బయట పడ్డాం' అనుకున్నాడు. మాటా మంతీ లేకుండా యిరువురూ నిశ్శబ్దముగా సమావేశ భవనంలోకి వచ్చారు. స్వాతంత్ర్య తీర్మానము గురించి డెలవార్ రాష్ట్రాన్ని వుద్దేశిస్తూ అడిగినప్పుడు చాలామంది కళ్ళు స్వారీ దుస్తులలో వున్న యీ సీజర్ రోడ్నీపై బడ్డాయి.

తన స్థానములో నిలబడి అతను ఇలా అన్నాడు : "నా రాష్ట్రములోని ప్రజలు స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తున్నారు - నేను కోరేది కూడా స్వాతంత్ర్యమే. అంచేత నేను ఈ స్వాతంత్ర్య తీర్మానాన్ని మనసారా బలపరుస్తున్నాను."

మధ్య రాష్ట్రాలు ఏక కంఠంతో పలికాయి. దక్షిణాన అయిదు - అయిదు రాష్ట్రాలూ ఓటింగ్ ప్రకారము స్వాతంత్ర్యాన్ని బలపరిచాయి. చివరికి లెక్క చూసుకున్నప్పుడు ఓటు చేసిన పన్నెండు రాష్ట్రాలలో, పన్నెండూ కూడా స్వాతంత్ర్యాన్ని బలపరిచినట్లే తేలింది. కార్యదర్శి ఈ ఫలితాన్ని హారిసన్‌కి తెలియపరచాడు. అధ్యక్షుడు ఈ నివేదికను హాంకాక్‌కు అందజేశాడు. అప్పటికే కాలాతీతమవడమువల్ల స్వాతంత్ర్య తీర్మాన వివరణలు వారు ఆరోజు పరిశీలించ దలచుకొనలేదు మరునాడు చూదామనుకున్నారు. మర్నాడు వుదయము తొమ్మిది గంటలకు సమావేశము వాయిదా వేయబడింది. జాన్ యాడమ్స్ వెలుపలకి బయలుదేరాడు. అతని మనసు ఎంతో తేలికగా వుంది - అనుకున్న పని సవ్యంగా జరిగిపోయింది; భవనద్వారం వద్ద జఫర్సన్‌తో కరచాలనంచేసి. "రేపు వుదయము 'డిక్లరేషన్' చర్చకు వస్తుంది అందులోని ప్రతి మాట కోసము నేను పోరాడదలచుకున్నాను" అని అన్నాడు.

తన నివాసానికి వస్తూ యాడమ్స్ ఆలోచనలో పడ్డాడు. ఈవిషయము వెంటనే భార్యకు తెలియబరచాలనీ ఆమె ఈ అద్భుత పరిణామానికి ఆనందిస్తుందనీ, యీ రోజున తప్ప కుండా వుత్తరము రాయాలనీ నిశ్చ యించుకున్నాడు. ఆ సాయంత్రం తన గదిలో వ్రాతబల్ల ముందు కూచూని, తన మహదానందము వ్యక్తబరుస్తూ వుత్తరము ప్రారంభించాడు. "1776 జులై రెండవ తేదీ. అమెరికా చరి త్రలో ఒక అపూర్వ ఘట్టము - తర తరాలవారూ మరువలేని శుభదినము" - జరిగిన విషయాలు యధాతథంగా చేయి వ్రాస్తున్నది కాని అతని మన సులో ఒక ఆవేదన వుంది. తన ఈ నూతన విజయము తన కుటుంబానికి ఒక నూతన ప్రమాదము. భార్యాపిల్ల లను యుద్ధ బీభత్సంతో నిండిన రాష్ట్రంలో వదలివచ్చి అప్పుడే ఒక సంవత్సరమయింది. స్వాతంత్ర్య తీర్మాన బహిరంగ ప్రకటనతో వైరము మరింత దారుణమవుతుంది. ఒక లిప్తకాలము - ఆమె వద్ద నుంచి యిన్నాళ్ళుగా వస్తున్న వుత్తరాల కట్టను చూశాడు, తన విచారాన్ని ఏకాంతాన్నీ పోగొట్టి నూతన ధైర్యో త్సహాలు సమకూర్చేందుకు తన సహ చారిణి, శత్రుమయ ప్రాంతం నుంచి రాసిన పవిత్ర లేఖలవి. ఆ లేఖలు చదువుతున్నప్పుడు అతనికి విపరీత మైన ఆవేదన, పట్టరాని కోపమూ కలిగేవి. ఆమె ఎటువంటి కడగండ్లకు లోనవుతున్నదో ! దూరాన ఎక్కడో పల్లె ప్రాంతాలగల తన కుటుంబపరి స్థితులను తెలిపే కిటికీల వంటి వుత్త



రాల ద్వారా, ఆ కిటికీల పరంపర తను వూహించుకోగలడు.

బ్రెయిన్‌ట్రీ వ్యవసాయ క్షేత్రము బొస్టన్‌కి కొద్ది మైళ్ళ దూరంలో వున్నది. సామాన్య విస్తీర్ణము గల ఆ క్షేత్రములోని రాతి గుట్టలను, వూబి నేలనూ తన భార్య ఎంతో కష్టపడి పరిశుభ్రపరిచి, దానిని ఒక వ్యవసాయ ఖండంగా చేస్తోంది. భార్యా భర్త లిరువురికీ అదే తమ పుణ్యభూమి. డబ్బిచ్చి పాలేరుని పెట్టుకునేందుకు వారికి శక్తి లేదు. యాడమ్స్ ఈ శత్రు ఆమిత ప్రదేశానికి ఏవిధముగానూ డబ్బు పంపలేడు. ఆ ప్రాంతాల స్కూళ్ళన్నీ మూసివేయబడంచేత, ఎబిగైల్ ఇంటి వద్ద పిల్లలకు విద్యాబోధన జరుపుతోంది. న్యూ ఇంగ్లండు వాసులకి పట్టుదలా, విశాల దృక్పథమూ ఆమె వారసత్వము. పదేళ్ళలోపు వయసు గల ముగ్గురు మొగపిల్లలనూ, ఒక ఆడపిల్లనూ ఎబిగైల్ ఒక్కర్తే సాదుకుంటూ వస్తోంది. తన శత్రువులు నిరంతరమూ కాచుకువున్నారు.

ఇంటిమిద్దె మీద నుంచి చూస్తే ముప్ఫై మైళ్ళ దూరాన గల ప్లిమత్ రాక్, సముద్రములో నించి లీలగా కనిపిస్తుంది. అయిదు తరాల క్రితము అక్కడే ఒక చిన్న ఓడ లంగరు వేసుకుని నిలిచింది. పాత ప్రపంచం నుంచి ఈ నూతన ప్రపంచానికి వచ్చిన వలసదార్లు వారు - ఆరాళ్ళమీద, అడవుల కొసని వారు శిబిరాలు వేసుకున్నారు. మొదటి చలికాలంలో, వచ్చినవారిలో సగము మంది ఆకలివల్ల, వ్యాధుల వల్ల మరణించారు. తిరిగీ వసంతము వచ్చేలోపన పద్దెనమండుగురు స్త్రీల లోనూ అయిదుగురు మినహా మిగతా అందరూ మరణించారు. 1621 ఏప్రిల్‌లో మేఫ్లవర్ ఓడ తిరిగి ఇంగ్లండుకి పయన మవుతున్నప్పుడు, ఈ వలస వచ్చిన వారిలో ఒక్కరు కూడా వెనక్కు మళ్ళేందుకు అంగీకరించలేదు. ఈ ఎబిగైల్, జాన్ దంపతులు, ఆనాటి ప్యూరిటన్ల సంతానమే. బైబిల్‌లోని బోధనలే వారి జీవితాశయాలు. గ్రీకు రోమను కావ్యాలే వారి సాహిత్య పరిచయం. న్యూ ఇంగ్లండులో జన్మించిన భావ వికాసానికి వారు వారసులు. మానవుడు హేతుపథాన పయనిస్తూ, హృదయవాంఛిత మగు లోకానికి సన్నిహితంగా రాగలడని వారు గాఢంగా నమ్ముతారు.

బొస్టన్ నగరానికి, అక్కర్లేదన్న తేయాకు ఓడలు, రెండున్నర సంవత్సరాల క్రితము వచ్చినప్పుడు, ప్రజలంతా ఒకటై ఏక లక్ష్యంతో ఈ తేయాకు సంచుల దిగుమతిని నిరోధిస్తారనీ, ఆ తేయాకు అక్కడి దిగకుండా కలిసికట్టుగా నిరోధిస్తారనీ ఎబిగైల్ అనుకుంది. తేయాకుని ఏదో విధంగా బొస్టన్ నగరంలో దింపటానికి వుద్యుక్తులైన రాజ వర్గీయులు పట్టణములో సైనిక శాసనం అమలు జరిపి, సభలూ సమావేశాలూ నిషేధించారు.

(ఇంకా వుంది

మాతృక : కార్నెల్ లెన్‌గ్వేల్
తెలుగు : యన్నార్ చందూర్

# కొత్త పుస్తకాలు

పాఠకులారా బహుపరాక్ - కథానికలు. రచన : గోవిందరాజు సీతాదేవి. ప్రతులకు : రచయిత్రి, 6 - 3-903/4/ బి, సోమాజిగూడ, హైదరాబాదు. వెల : రు 16-00.

1974 - 83 మధ్యకాలంలో గోవిందరాజు సీతాదేవి, వివిధ పత్రికలను వ్రాసిన పదమూడు కథానికలు ఈ సంపుటిలో ఉన్నాయి. కథల సంపుటాలు చాలా అరుదుగా వెలువడుతున్న ఈ రోజులలో రచయిత్రి చేసిన ప్రయత్నం మెచ్చుకోదగ్గది. ఈ మంచి ప్రయత్నానికి ఆర్థిక సహాయమందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారు అభినందనీయులు.

'డ్రిల్ మాస్టారూ ఎక్స్‌స్టూడెంట్సూ' లో, డాక్టరు రాధాకృష్ణ తన చిన్ననాటి జ్ఞాపకాలలోని మాధుర్యం చవి చూస్తూండగా, అతను బ్రతికించలేక పోయిన దోస్తు రెహమాన్ స్మృతి, మనసుని విషాదంతో కుంగతీస్తుంది : ఆనందపుటంచున గల విషాద రేఖను రచయిత్రి మనోజ్ఞంగా చూబుతారు.

అదేవిధంగా రిటైర్డ్ సర్కిల్ ఇనస్పెక్టరు త్రినాధరావు ఇంట్లో జరిగిన దొంగతనం, కూతురు కళ్యాణినేగాక, సామాన్య పాఠకుని సైతం విస్మయపరుస్తుంది ('థ్రిల్'). స్వభావరీత్యా జనించే దొంగ బుద్ధికి పేద, ధనిక తేడాలు లేవు. ఆ మాట కొస్తే ఈ జాడ్యం సంపన్న కుటుంబ బాలుర లోనే ఎక్కువ.

రచయితకు సామాజిక బాధ్యత లేదా అన్న విషయం మొదటి కథలోని పాత్రలు, 'వంశీకృష్ణ' ఎవరో తెలుసుకొనే పరిశోధనలో చర్చిస్తాయి.

మొత్తం మీద కథలన్నీ బావున్నాయి - శిల్పం విషయం లోనే యింకొంచెం శ్రద్ధ కావాలి.

'మన దేవతలు' - రచన : జానమద్ది హనుమచ్ఛాస్త్రి. శ్రీశైల దేవస్థానం ప్రచురణ. కాపీలకు : రచయిత, 1/74 ఎ, గాంధీనగర్, కడప - 4.

వైదిక సాహిత్యానికి మూలం ఋగ్వేదం. ఆ ఋగ్వేదం 10వ మండలంలోని 129 వ సూక్తంలో "సృష్టికి ముందు, జగన్నిర్మాణానికి కారణభూతమైనదీ, అవ్యక్తమైనదీ, ఇంద్రియజన్యమైన జ్ఞానానికి గోచరం కానిదీ, నామరూపములు నిర్దేశించుటకు అసాధ్యమైనదీ అయిన 'అసత్' కాని, ఇంద్రియ గోచరమై వ్యక్తమగు 'సత్' కాని వుండలేదు. లోకాలూ వుండలేదు. అంతరిక్షమూ లేదు, నీరూ

లేదు''.... ఆ 'తాపమే' తపస్సు అనీ, బ్రహ్మ మనసులోని 'కామమే' జగత్ సృష్టి అనీ చెబుతారు.... బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టి స్థితి లయకారకులు. ఆ తర్వాత ఇంద్ర, అగ్ని, వరుణాది దేవతలు. దివ్య గుణములతో కూడుకొన్నది దేవత....

గణపతి, సరస్వతి, మహాలక్ష్మి, దక్షిణామూర్తి, కృష్ణుడు, రాముడు, హనుమాన్, అష్టదిక్పాలకులు, అయ్యప్ప, సుబ్రహ్మణ్యస్వామి - యిలా వీరందరి గురించి, పౌరాణిక చారిత్రకాధారాలతో, నేటి పాఠకునికి బోధపడేటట్లు చాలా చక్కగా వివరించారు జానమద్ది హనుమచ్ఛాస్త్రి ఈ పుస్తకంలో.

—క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

'సరళి' - వచన, గేయ, కథా కవితలు, సి. వేదవతి. స్పందన సాహితీ సమాఖ్య, మచిలీపట్టణం .... రు 15-00

'ప్రకృతితో మానవుని చెరలాటం' - వసంతరావు వేంకటరావు. భాగ్యనగర్ ప్రచురణలు, మచిలీపట్నం .... రు 10-00.

విజ్ఞాన సర్వస్వము - 1. (దేశము - చరిత్ర). తెలుగు భాషాసమితి, ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణ, హైదరాబాదు - 500 007 .... రు 100-00.

'ప్రగతిగీత' - అద్యతన సాహితీ సప్తశతి. డా॥ నండూరి రామకృష్ణమాచార్య. ప్రగతి గీతా ప్రచురణలు, హైదరాబాదు - 4 .... రు 10-00.

'హదీసు వెలుగు' - మూలం : మౌలానా జలీల్ అహసన్ నద్వి - తెలుగు : ఎస్సెమ్ మలిక్ .... రు 30-00. సందేహాలు - సమాధానాలు - నిజామీ కుమార .... రు 25-00 .... తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ కోట్, ఛత్తాబజార్, హైదరాబాదు - 2

స్త్రీ - ఇస్లాం వెలుగులో. మూలం : ముహమ్మద్ తఖియుద్దీన్ - తెలుగు : ముహమ్మద్ అజీజుర్రహ్మాన్ - మజ్లిసె ఇషా అతె ఇస్లాం, సయిదాబాద్, హైదరాబాదు - 659 .... రు 8-00.

పట్నం ఎలుక - నక్క, ద్రాక్ష ; కాకి - కడవ, తోడేలు - గొర్రెపిల్ల ; నాన్నాపులి, వేటగాడు - గుర్రం ; గుర్రం - గాడిద, కొంగ, - తోడేలు ; పొగరుబోతు కుక్క ఐకమత్యం ; గాడిద తెలివి - నీలితోడేలు ; సింహం - ఎలుక, కుక్క - మాంసం ముక్క ; బాతు - బంగారుగుడ్డు, పిల్లిమెడలో గంట .... ఈ బుజ్జి కథలన్నీ ఒకొక్కటి రూపాయి .... అట్ల తద్దోయ్ - ఆరట్లోయ్ పండుగల పాటలు .... ఎల్లోరా రచన - ఎనిమిదేళ్ళ పై బడ్డ వారి కని ఉద్దేశించినది రు 3-00 ; విశ్వకవి - రవీంద్రనాథ టాగూరు జీవితం - రు. 4-00 ; స్వరాజ్యం నా జన్మహక్కు - రు 10-00 ద్వితీయ ముద్రణ పొందిన ఈ రెండిటి రచయిత : డి రామలింగం .. పై పుస్తకాలన్నీ దొరికే చోటు : ఆంధ్ర

ప్రదేశ్ బాలల అకాడమీ, జవహర్ బాలభవన్, పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాదు - 4.

ముత్యాల పల్లకి - నవల (రు 25 - 00); దేవుడు బ్రతికాడు - నవల (రు 15 - 00); అనురాగ ధార - (రు 18 - 00) పైమూడు పుస్తకాల రచయిత్రి : గోవిందరాజు సీతాదేవి. ప్రచురణ : అనూరాధా పబ్లిషర్స్, 6-3-903 - 4/B సోమాజిగూడా, హైదరాబాదు - 482.

తెలుగు సామెత నాటికలు (1); తెలుగు సామెత నాటికలు (2) పిలువని పేరంటం (ఒకొక్కటి రు 25-00) ఉదయకాంత - కవితలు (రు 6/-); రవళి - కధల సంపుటి (రు 10 - 00) .... పైనాలుగు పుస్తకాల రచయిత్రి : తెన్నేటి సుధా రామరాజు. కాపీలకు : వంశీకృష్ణ , పబ్లిషర్స్, 2 - 1 - 527/5 నల్లకుంట, హైద్రాబాద్ - 44.

అమెరికా అధ్యక్షులు - వంశీ రామరాజు .... వంశీ కల్చరల్ అండ్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, న్యూ నల్లకుంట, హైద్రాబాద్ - 44 .... రు 25 - 00

వెన్నెల తెరచాప - నారాయణరెడ్డి. రచన : రావూరు వేంకట సత్యనారాయణరావు .... (రు 10-00); ఆదర్శ దంపతులు - పుల్లయ్య, శాంత కుమారి .... (రు 10-00) బాపు రెడ్డి సాహితీ సమాలోచనం - రచన : క(రా కార్తికేయశర్మ .... (రు 8 - 00); ఆరుద్ర రచన శ్రీకృష్ణ దేవరాయ - రూపవాణీ రూపకభీ .... (రు 10 - 00); 'మన పట్టాం' - రచన : కళాప్రపూర్ణ రావూరు .... (రు 10 - 00) .... పైపుస్తకాలు ప్రచురించినవారు : వంశీ ఆర్ట్ థియేటర్స్, 1 - 2 - 527/5 నల్లకుంట, హైదరాబాదు - 44.

అందుకున్నవన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి, అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B.2922 - Madras - 600 004.

# ముఖచిత్రం



పధ్నాలుగేళ్ల హైస్కూలు విద్యార్థి, తనలోని సాహిత్య తృష్ణకు ప్రతీకగా, 'మురసోలి' (మృదంగనాదం) అనే లిఖిత పత్రిక ప్రారంభించాడు. సహాధ్యాయులలో తనకొక గుర్తింపు లభించింది. ఆ లేత వయసులోనే 'ఉత్తరాదిని మాట్లాడే హిందీ మన మీద నెందుకు రుద్దాలి? ఇష్టపడి ఎన్ని భాషలైనా నేర్చుకోవచ్చు - కాని, బలవంతపెట్టడం సబబుకాదు' - అనే అభిప్రాయం నాటుకుపోయింది. ఆనాటి 'మురసోలి'యే నేటి డియమ్‌కె పార్టీ వారి ప్రఖ్యాత తమిళ దినపత్రిక.... చిన్న తనంలోనే కరుణానిధి, పెరియార్ (ఇవి రామస్వామి నాయకర్), బోధలవల్ల ప్రభావితులయారు. అణ్ణాదురైకీ పెరియార్‌కీ అభిప్రాయ భేదంతో ద్రవిడ కజగమ్‌నుంచి ద్రవిడ మున్నేట్ర కజగమ్ ఆవిర్భవించింది. ఈ డియమ్‌కె పార్టీ, కాంగ్రెస్‌కి ప్రత్యామ్నాయంగా నిలబడటానికి కరుణానిధి గావించిన అవిరళ కృషి చరిత్ర ప్రసిద్ధం. అణ్ణాదురైకి అప్పట్లో కుడిభుజం. 'పార్లమెంటు ఎన్నికలలో లోక్ సభకి డియమ్‌కి ప్రతినిధిగా ఎన్నికైన అణ్ణాదురై, 1967 లో తమిళనాడుకి ముఖ్యమంత్రి అయారు - డియమ్‌కె పార్టీ సామాన్య ప్రజలలో రాజకీయ చైతన్యం తెచ్చేందుకు, ఆ చైతన్యంతో బాటు సామాజిక శ్రేయం పెంపొందిందుకూ అహోరాత్రులు కష్టపడిన కరుణానిధి పబ్లిక్ వర్కుసూ ట్రాన్స్‌పోర్ట్ శాఖలకు మంత్రిగా నియమితులయారు. అణ్ణాదురై దివంగతులయాక. 1969 లో తన 45వ ఏట తమిళనాడుకి ముఖ్యమంత్రి అయారు కరుణానిధి. స్వాతంత్ర్య దినోత్సవంనాడు పతాకావిష్కరణ రాష్ట్రముఖ్యమంత్రి చేయాలనే మార్పుకి, సంప్రదాయానికి అద్యులు కరుణానిధి. తనదైన శైలిలో గొప్పవక్తేగాక, 150 కథానికలు, 25 నాటకాలు వ్రాసి, 50 చిత్రాలకు కథలూ సంభాషణలూ సమకూర్చి - సాహితీపరంగా ఒక ప్రత్యేక స్థానం పొందారు. రాజకీయాందోళనలకు ముందు నుండి ఎన్ని తడవలో శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్లారు. పేదల పెన్నిధిగా అయన పేరు ప్రతిష్టలెటువంటివో మొన్నటి ఎన్నికలు యావద్భారతానికీ రుజువుచేశాయి. 1972 లో యమ్‌జి రామచంద్రన్‌ని పార్టీ నుంచి బహిష్కరించడం, డియమ్‌కె రెండుగా చీలిపోవడం.... ఎమర్జన్సీని వ్యతిరేకించిన కారణంగా కేంద్రం 1976లో కరుణానిధి మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయడం యమ్‌జిఆర్ దశాబ్ది ఇలా పదమూడేళ్ల పాటు వోపికగా వేచి వుండి, డియమ్‌కెకి పునరుజ్జీవనం, అఖిల భారతఖ్యాతి కలిగించారు రాజనీతిలో అద్వితీయ ప్రతిభావంతులైన కరుణానిధి.

## డైరీ

1988 డిసెంబరు 24

డిసెంబరు నెల ద్వితీయార్ధ మంతా మద్రాసు నగరంలో సంగీత నాట్యోత్సవాలు. ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ, మ్యూజిక్ అకాడమీ, నారదగాన సభ, కృష్ణగాన సభ, తమిళ్ఇసై యిలా పది పన్నెండు దాకా ప్రముఖ సంస్థలు ఉన్నాయి. ఉదయంవేళ సంగీతాభిరుచిని పెంపొందించే డిమానస్ట్రేషన్ లెక్చర్లు - వీటికి టికెట్లు ఉండవు. ఆసక్తి గల వారెవరైనా సరే వచ్చి కూచుని వినవచ్చు. సాయంత్రం ప్రోగ్రాములకి, డెయిలీ టికెట్లూ సీజను టికెట్లూ ఉంటాయి. భారతీయ సంగీత నాట్యాలపట్ల, సామాన్యులకు సదవగాహన ఏర్పడేందుకు, మన కళా సంప్రదాయాల ఓనమాలు తెలుసు కొనేందుకు దశాబ్దులుగా మద్రాసులో జరుగుతున్న కృషివంటిది మరింకే పట్నంలోనూ లేదు. అన్నీ వినాలని ఉంటుంది. తెలుసుకోవాలని ఉంటుంది గాని దైనందిన జీవితంలోని వొత్తిడులూ, మనం కేటాయించ గల సమయమూ బట్టి, ఎన్నో మంచివీ అపురూపమైనవీ కళ్ల ముందు కదలాడుతూనే అందకుండా పోతాయి. హరికథ ఆంధ్రుల సొత్తు. ఆదిభట్ల నారాయణదాసు ఆ ప్రక్రియకు పితామహుడు. కుప్పస్వామి నాయుడు చెప్పిన ధృవ చరిత్ర వల్ల ప్రేరితులై నారాయణదాసు, హరిశ్చంద్రుని వృత్తాంతం హరికథగా చెప్పారు. ఇందులో యక్షగానమూ కాలక్షేపమూ మిళితమై మార్గ, దేశీరీతులలో జనరంజన గావిస్తుంది. 'జాతి చెరచెగాని నీతి చెరవగలదా ?' అని పలికే హరిశ్చంద్రుని ఆత్మవిశ్వాసానికి స్పందించిన మనిషి ఉంటాడా? నైమిశారణ్య పౌరాణికాల వరవడిని వాక్శుద్ధీ గాత్రశుద్ధీతో నారాయణదాసు (1864 - 1945) చెప్పిన హరికథా కాలక్షేపం మైసూరు మహారాజాని, రవీంద్రనాథ్ టాగూర్‌ని మెప్పించాయి. మైసూరు మహారాజు తన ఆస్థాన విద్వాంసునిగా ఉండి పొమ్మన్నారు ; కానీ, నారాయణదాసు నిరాకరించారు - ఉత్తమ కళాకారు

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచన మృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి – విజయవాడ – 2

సికి స్వాతంత్ర్యమే ఊపిరి అని త్రికరణ శుద్ధిగా నమ్మిన వారవటంచేత ! .... కలకత్తా వెళ్లి రవీంద్రనాథ్ టాగూర్‌కి స్వయంగా తన హరికథాగానం వినిపించారు నారాయణదాసు. టాగూర్ 1936 లో విశాఖపట్నం ఆంధ్రా యూనివర్సిటీకి వచ్చినప్పుడు, విజయనగరం వెళ్లి నారాయణదాసుని చూశారు. ఈ రెండు ఉదంతాలూ చాలు ఆదిభట్ల నారాయణదాసు ఎంతటి కవిపండితులో, వాగ్గేయకారులో, సంగీత సార్వభౌములో తెలుసుకునేందుకు ; .... మద్రాసు మైలాపూరులోని కపాలేశ్వరాలయంలో ఆయన హరికథాగానం చేశారు. గంధర్వాంశ గల ఈ మహనీయుడు పద్నాలుగు హరికథలు రచించారు ; నలభైఅరు గ్రంధాలు వ్రాశారు .... 'నీపదంబు తాకినంతనే పవిత్ర నైతి, రామా' అని అహల్యా, 'శ్రీపతి నీమహిమ పొగడ శివుని తరమా, నీవు తప్ప వేరేదియు కానరాదు' అని మరొకరూ వేడుకోవంట, భావస్ఫూర్తితో రసభరితంగా ఆయన చెబుతున్నప్పుడు సభికులు పారవశ్యంలో మునిగేవారట. 'యదార్ధ రామాయణం' ఆరు సంపుటాలుగా వ్రాశారాయన .... డా॥ పప్పు వేణుగోపాలరావు ఈ ఉదయం బాల మందిర్ జర్మన్ హాలులో, ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటివారు ఏర్పరిచిన డిమాన్‌స్ట్రేషన్ లెక్చరులో ఆదిభట్ల నారాయణదాసు గురించిన విశేషాలు ఎంతో చక్కగా చెప్పారు. విజయనగరం ఒకప్పుడు సంగీత సాహిత్యాలకు పుట్టినిల్లు - ఇప్పటికీ ఆ ప్రభావం లేకపోలేదు. కళావరురింగూ, దొడ్డమ్మదాసు (బస్సు పుట్టిందోయ్, బాబూ, బస్సు పుట్టింది') ఒక తరహాకు చెందిన వారైతే, గురజాడ, ఆదిభట్ల, ద్వారం, ఘంటసాల మరొక వరవడిలోని వారు. అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్‌కి ప్రాంతీయ డైరక్టరైన డా॥ పప్పు వేణుగోపాలరావు కూడా విజయనగరం వారే ! రాజాలక్ష్మీ ఫౌండేషన్ రమణయ్యరాజా అక్కడివారే! కేంద్రసాహిత్య అకాడమీ తెలుగుశాఖ ముఖ్యప్రతినిధి వసంతరావు వెంకటరావు విజయనగరం కాలేజీ మాజీ ప్రిన్సిపాల్.

. . . . . 26

చిక్కుల్లో యిరుక్కున్న సుమన్‌కి విముక్తి లభించిన శుభ సందర్భంగా మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్టులు హొటల్ పామ్‌గ్రావ్‌లో చిన్న పార్టీ ఏర్పాటు చేశారు. అసోసియేషన్ అధ్యక్షులు శ్రీనివాస్ స్వాగతం తెలిపిన మీదట, కాగడాశర్మ సుమన్‌కి మంచి జరగాలని కోరారు.... "నాకు ఎవరి మీదా కినుక, కోపం లేవు. ఈ మనోవ్యధ, ఈ అగచాట్లు నా గ్రహచారంగా భావిస్తాను. మా అమ్మగారి చల్లటి మనసూ, నాలోని భగవద్విశ్వాసమూ ఈ రెండే నాకు ఆత్మబలాన్ని యిచ్చి, దురదృష్టవశాత్తూ నన్ను చుట్టుముట్టిన చీకటి తెరలని తొలగించాయి. నిర్మాతలు ఆదరిస్తున్నారు, అవకాశమిస్తు

న్నారు; పత్రికలవారు నన్నెప్పుడూ అభిమానిస్తూ, కష్టకాలంలో నాకు అండగా నిలిచారు'' - అన్నారు, కారు మేఘాల నుంచి బయటపడ్డ చంద్రుని లాటి సుమన్.

## . . . . . 31

పోయిన సంవత్సరం హేమా రామేశం దంపతుల యింట్లో కొత్త సంవత్సరానికి స్వాగతం పలికాము. రామేశం ఆ రోజున అబుదాబీ నుంచి రాత్రి పదిన్నరకి అందరికీ శుభాభినందనలు తెలిపారు. ఈ సంవత్సరం మనింట్లో జరుపుదామన్నది మాలతి.... 'రామేశం రేపు మధ్యాహ్నానికి వస్తారు - నేను తీసుకువస్తాను కద' - అంది హేమ, నిన్న నీలగిరీస్ దగ్గిర కనిపించి! .... రమణయ్య రాజా దంపతులు, ప్రేమ్‌చంద్ దంపతులు, పప్పు వేణుగోపాలరావు దంపతులు, రామేశం దంపతులు, డివి నరసరాజు వారి కుమార్తె కవిత, 'బియస్సార్' కృష్ణ, మాలతి ఫ్రెండ్ నందిని - యిలా పదహారూ పద్దెనిమిదిలోపు. రావి కొండలరావు దంపతులు రావలసివుంది గాని ఏదో షూటింగ్‌లో యిరుక్కుపోయి, ఆయన రాలేకపోయారు .... చీటీల గేమ్ ప్రేమ్‌చంద్ వంతయితే, పద్యాలూ పార్సులతో నవ్వించారు వేణుగోపాలరావు. ముప్పయ్యేళ్లీ మధ్య డ్రింక్ లేకుండా గడిపిన 'న్యూ ఇయర్ ఈవ్' యిదే అని చెప్పిన రామేశం, గోదావరి పుష్కరాలు, బస్సు పుట్టిందోయ్ పాటలతో అందరినీ ఆనందింపజేశారు. తొమ్మిది నుంచి పన్నెండు దాకా కబుర్లూ కాకరకాయలతో, మాటలూ ఆటలూ పాటలూతో గడిచాక, సరిగ్గా పన్నెండు గంటలకి శాంథోమ్ చర్చి గంటలు వినిపించగానే, రాజాగారు పట్టుకొచ్చిన 'న్యూఇయర్ కేక్'ని, హొస్టెస్ అయిన మాలతీ చందూర్ కోయాలన్నారు.... ఒకరు లోనికెళ్లి ప్లేట్లు పట్టుకురాగా - ముక్కలు అందంగా కట్‌చేసి ప్లేట్లలో సర్దారు రామేశం.... పరస్పర శుభాకాంక్షలు చెప్పుకున్నాక, ఒక్కొక్కరే మెట్లు దిగారు. అందరినీ వారి వారి కార్లలో ఎక్కించి, పైకొచ్చేసరికి పన్నెండున్నర దాటింది.... 'రాధా, శివస్వామీ కూడా వుంటే బావుండేది' - అంది మాలతి. 'నిజమే మరి, వారు కొచ్చిన్‌లో ఉన్నారాయె!' - అన్నాను.... పాత సంవత్సరానికి వీడ్కోలు, కొత్త సంవత్సరానికి స్వాగతం పలకడానికి, మా ఆహ్వానం మన్నించి, మాయింటి కొచ్చి సంతోషం పంచిపెట్టిన సన్నిహిత మిత్ర బృందానికి మా కృతజ్ఞతా పూర్వక వందనాలు, శుభాభినందనలు.

## 1989 జనవరి 06

ఉదయం మూడుంబావుకి హైదరాబాదు నుంచి కృష్ణ టెలిఫోన్ చేసి, 'సాడ్ న్యూస్ - అరగంట క్రితం పెదనాన్నగారు పోయారు' - అన్నాడు. 'బయల్దేరేందుకు యింకో గంటటైము ఉందిగనుక పొద్దుటి ఫ్లయిట్‌లో శారద పిన్ని, మాలతి పిన్ని వస్తున్నారు' -



"Hanuman was sent to Lanka in search of Sita and he could hop over from the sea-coast as he was the son of Wind-God", said Raghu.

"Hop over ---. ? Alright, let us accept. Anjaneya was only a member of the party sent to South by Sugriva," observed Raghu's Father.

"What do you mean by that, Dad ? Hanuman was the person who could actually find out Sita in Ashokvan and he was entrusted with that task."

"No, Raghu. Sugriva sent four segments of his army in the four directions, east, north, west and south. And each segment was commanded by a member of the royal family - that means related by blood either to Sugriva or to Vali. Anjaneya was a mere minister of Sugriva. Being slightly aware of Sita being somewhere down south, he chose Angada, son of Vali, as the commander of the southern army and Anjaneya had to carry out Angada's instructions in this expedition. That way Sugriva pacified Angada to a possible revolt in the ranks of the army due to the death of Vali in an unfair manner. Hanuman, the erudite scholar, knew it all and Hanuman worked under the supervision of Angada, keeping an eye on him as well. That was the political wisdom of those times," explained Raghu's Father.

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



అని చెప్పాను. నేను కూడా వెళ్లివుండా ల్సింది - కాని, ముగురం వెళ్లే అవ కాశం లేదు. ఎవరో యిద్దరమే వెళ్ల గలం. పెద్దావిడ మా అక్కగారు ఒక్కరూ ఉండలేరు. ఆదరాబాదరా ఏర్‌పోర్ట్ చేరుకు. పాతిక ముప్ఫయి మంది వెయిటింగ్ లిస్టులో ఉన్నప్ప టికీ, ఎమర్జన్సీ కోటాలో నుంచి రెండు సీట్లు, అక్కడి ఆఫీసరు మాలతి మాట ఆలకించి, యివ్వడం వల్ల వారిద్దరూ ఏడున్నరలోపున హైదరాబాదు చేరు కోగలిగారు. ఇంటికొచ్చి 'ఎవి ఆర్ జి'కి ఫోను చేయగా, ఆయన అంతటి చలిలో బేగంపేట వెళ్లి, వాళ్ల మారు తిలో వీరిద్దరినీ నల్లకుంటలో దింపి వచ్చారు. ఇదంతా ఆరోతేదీ ఉదయాన - నాలుగో తేదీనే శారదాంబ హైదరా బాదు నుంచి వచ్చింది. 'బావగారు అలాగే ఉన్నారు - బెడ్ సోర్స్ రాకుండా ఎలక్ట్రిక్ మాట్రెస్ ఏదో ఉందట - అది కొని పంపాలి' - అని చెప్పింది. వాకబు చేయగా అయిదారు వేలలో దొరకవచ్చునని తెలిసింది. దాని అవసరం లేకుండానే 'బావగారు' దీర్ఘనిద్రలోకి జారుకున్నారు.

'ఎవరీ బావగారు? ఆయన చేసిన ఘనకార్య మేమిటి?' అనే ప్రశ్న రావచ్చు. ఆయన ఏ ఘనకార్యమూ చేయలేదు. సర్వసామాన్య కుటుంబీ కునిగా, సజ్జనునిగా, సత్‌పౌరునిగా, సదాశయునిగా, సద్గుణవంతునిగా, స్వధర్మ నిరతునిగా, కొన్ని వేల మందికి నిజమైన విద్యాదానం చేసి, సహస్ర పౌర్ణమీ దర్శనానంతరం, అలసట చెందిన ఈ పాంచ భౌతిక శరీరాన్ని వొదిలివేసిన అమృతమూర్తి, ఎడ్యుకేషనల్ సర్వీసు నుంచి రిటైర యాక, పాతికేళ్లపాటు, విద్యాభిలాషతో తన వద్దకు వచ్చినవారికి లెక్కలూ, ఇంగ్లీషూ చెప్పేవారు. సంపన్నులు అధిక మొత్తం యిస్తే, పేదలకు ఉచి తంగా చెప్పడమేగాక, వారికి అడపా దడపా ధనసహాయం కూడా చేస్తూండేవారు .... రాయప్రోలు వేంకటకృష్ణ దీక్షితులు కృష్ణాజిల్లా ఆగిరిపల్లిలో జన్మించారు. ఆనాటి సంప్రదాయ శృంఖలాలు తెంచుకు, ఆంగ్ల విద్య నేర్చుకు, విజయనగరం మహారాజా కాలేజీ నుంచి పట్టభద్రులై, రాజమండ్రిలో టీచర్ ట్రయినింగై, అప్పట్లో సర్కారు జిల్లాల్లో ఉద్యోగం దొరకడమనేది దుర్లభమవడంతో నైజాం సంస్థానంలో జాబ్ సంపా దించుకు, విద్యాబోధన ఉర్దులో జర గాలనే నియమం వుండటంచేత, ఉర్దు భాష క్షుణ్ణంగా నేర్చుకు, అందులో పరీక్షలు పాసై, ఉస్మానాబాద్, కలమ్ (ఇప్పడవి మహారాష్ట్రలో ఉన్నాయి - అప్పట్లో నిజామ్ సంస్థానం లోనివి) మున్నగుచోట్ల అధ్యాపకునిగా పని చేశారు. ఆల్‌జిబ్రా, జామెట్రీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ యిలాటివన్నీ యిప్పుడు మన భాషావాదులు చేస్తున్న ప్రయోగాల్లాగానే అప్పటి నిజాం ప్రభువులు అవి అన్ని ఉర్దులో నేర్ప మని శాసించారు .... దీక్షితులుగారు ఖమ్మం, హనుమకొండ, ఖైరతాబాద్, బికనూర్, ఉస్మానాబాద్, - యిలా

చాలా ఊళ్లు తిరిగారు ఉద్యోగరీత్యా. రిటైరయాక కొన్నాళ్లపాటు బర్కత్ పురాలో ఉండి, తనూ, తన సోదరుడు శంకరం, నల్లకుంటలో పక్క పక్కన యిళ్లు కట్టించుకున్నారు. సోదరునికి చదువు చెప్పించి వృద్ధిలోకి తెచ్చినది దీక్షితులుగారే. దీక్షితులుగారి భార్య సీతాబాయి, మాలతికి పెద్దక్కగారు. ఆదంపతులకి పిల్లలు లేరు. శంకరం కుమారులు అమర్ ('ఇసిఐయల్' లో ఇంజనీరు), కృష్ణ (ఆంధ్రాబాంకులో ఆఫీసరు) - వీరిద్దరికీ పెదనాన్న గారంటే ఎంతో భక్తి విశ్వాసాలు, వినయ విధేయతలూను. ఆ విస్తృత కుటుంబంలోని ప్రేమాభిమానాలు అద్వితీయమైనవి - మనసుని ఆహ్లాద పరిచే మంచిగంధమది - మల్లెల పరిమళమది .... ఇదంతా కుటుంబగాథ. 'బావగారి' గురించి ఎందుకు చెబుతున్నానంటే, నాలోని సాహిత్య పిపాసకు, మంచి పుస్తకాలు చదవాలనే తపనకు ఆద్యులు ఆయన. 'ఇంప్రెషనిస్టిక్ ఏజ్' లో మనం విన్నమాటలు, శ్రద్ధగా ఆలకించిన పలుకులు, జీవితాన్ని మలుపు తిప్పుతాయి. "చరిత్ర తెలిసేందుకు సర్ వాల్టర్ స్కాటూ, సమాజ స్వరూపం తెలిసేందుకు ఛార్లెస్ డికెన్సూ చదవాలి. షేక్స్పియర్ నాటకాలు గొప్పవేగాని, ఫౌస్ట్ లోని మెఫిస్టోఫిలిస్ మనని భయపెడతాడు: క్లాసిక్స్ మనసుని విశాల పరుస్తూ, చుట్టూ ప్రపంచాన్ని సావధానంగా అర్థం చేసుకొనేందుకు ఉపకరిస్తాయి" - అన్నారొకసారి దీక్షితులు గారు నూజివీడు కొత్త యింట్లో. అధ్యాపకవృత్తిలో ఉన్న వారవడం చేత, మాటల సందర్భంగా ఆయన అలా అనివుండవచ్చు. కాని, ఆ హితవచనం నా గమ్యాన్ని, దృక్పథాన్ని మార్చి వేసింది. దీక్షితులు గారి తర్వాత, మంచి పుస్తకాలపై నాదృష్టి మరల్చి, నాలోని రచనాసక్తిని పెంపొందించినవారు యిద్దరే - ఒకరు: శ్రీనివాస శిరోమణి; మరొకరు: యస్ జి ఆచార్య. నా మొదటి రచనలు అచ్చువేయటమే గాక రచనా క్రమం ఎలా ఉండాలో నేర్పినవారు యస్ జి ఆచార్య; షెకవ్. తుర్జనీవ్, దొస్తవయాస్కి, టాల్‌స్టాయ్, మపాసా, బాల్జాక్ రస్కిన్‌లు చదవమని ఇంగ్లీషులో కాదు, తెలుగులో వ్రాయండి - అని చెప్పినది శ్రీనివాస శిరోమణి. దీక్షితులు గారు, యస్ జి ఆచార్య, శ్రీనివాస శిరోమణిల తర్వాతనే మిగతా సాహితీ బంధువులూ సాహితీ మిత్రూలూను. దీక్షితులు గారి నిష్క్రమణతో కొంత శూన్యం ఆవరించినా, అది జగన్నాటక లీలలో ఒక భాగమని అంగీకరించక తప్పదు. "ఎంత తియ్యగా మాటలు చెప్పినా స్వభావనైజానికి బందీలుగాక తప్పదు. మాటకూ, నడతకూ మధ్య గల తేడా తెలుసుకుంటూ, మననెవరో వంచింపారనే అశాంతికి లోను గాకుండా వుండటంలోనే సుఖం సామరస్యం ఉన్నాయి" - అని ఆయన ముప్ఫయ్యయిదేళ్ల క్రితం చెప్పినది, యిప్పటికీ నా చెవులలో సన్నగా వినిపిస్తూనే ఉంది. దీక్షితులు గారు

సుగుణ జీవనులు ; చదువుని పంచి పెట్టి చరితార్థులయారు. తను కాల పురుషునికి ప్రణమిల్లి తన వారందరికి గుండెల్లో దివ్య స్మృతిగా మిగిలారు. .... 'అంబరం బొకచిత్ర దీపంబు ; రవియు - దీపపు శెమ్మె ; లోకంబు తెరపటంబు - నీడ బొమ్మలు మను జులు - నిఖిలమునకు - గాలి చక్రంబు నిర్ణేత ; గతి యనాది' - అన్నారు దువ్వూరి రామిరెడ్డి.

. . . . . 17

కోయంబత్తూరు వెళ్తూ, మిత్రులు కృష్ణమూర్తిగారు నిన్న ఉదయం ఫ్లయిట్‌లో హైదరాబాదు నుంచి యిక్కడికి వచ్చారు .... "విజయా హాస్పటల్‌కి ఒకసారి వెళ్దాం" - అన్నారు. వారి కొలీగ్ చంద్రశేఖరం గారికి 'బైపాస్' జరిగింది .... పర స్పర పరిచయాలయాక, మిసెస్ చంద్రశేఖరరావు - ఆండాళ్ - "ఇరవై ఏళ్ల క్రితం దీక్షితులు గారి వద్ద ఇంగ్లీషు నేర్చుకున్నాను - అప్పట్లో మేము బర్కత్‌పురాలో ఉండేవారం" - అన్నారు. దీక్షితులుగారు దివంగతు లైన విషయం వారికి తెలియదు - నేను చెప్పలేదు, అప్పట్లో చెప్పకూడ దని ! .... పొద్దుటే లేచి నేనేదో వ్రాత పని చూసుకుంటూండగా, ఆరున్నరకి లేచి, కాఫీ సిప్ చేస్తూ 'హిందూ' తిరిగేస్తున్న కృష్ణమూర్తిగారు (ఇంట్లో మేమిద్దరమే - లేడీస్ హైదరాబాదు వెళ్లారు) - కోయంబత్తూరు ఫ్లయిట్ అయిదున్నరకే వెళ్లిపోయిందట - యివ్వాళ నుంచే టైమింగ్స్ మార్చా రట" - అన్నారు. "మధ్యాహ్నం పద కొండుగంటలకని మీకు టికెట్ యిచ్చి, ఆ ఫ్లయిట్ ఉదయం అయిదున్నరకి వెళ్లిపోవడమేమిటి ? టైమింగ్స్ మార్చి నట్లు కనీసం నిన్నటి పేపర్లో అయినా వేయవచ్చుకదా ! ప్రయాణీకుల పట్ల ఇండియన్ ఎయిర్‌లైన్స్ యాజమాన్యా నికి ఆపాటి బాధ్యత లేదా ? ఎవరైనా పాసింజరు పదిలక్షలకు దావావేస్తే అప్పుడు కాళ్ల బేరానికి వస్తారు" - అన్నాను .... "అప్పుడూ రారు - మనదేశంలో 'యకౌంట్‌బులిటీ' ఎవరి కుంది గనక !" - అన్నారాయన .... మర్నాటి సెమినార్‌లో ఆయన పాల్గొన వలసి వుంది - అందుకనే వచ్చారు. రాత్రి రెండుఎక్స్‌ప్రెస్‌లు వున్నాయి - కాని, ఎసి ఫస్ట్‌క్లాస్ కూడా అందులో దొరక్కపోతే ? మధ్యాహ్నం పన్నెండు గంటలకి మరొక ఎక్స్‌ప్రెస్ ఉంది. తొమ్మిదిన్నరకి స్టేషన్ చేరుకున్నాం. కంప్యూటర్ సిస్టమ్ వచ్చాక, అన్ని కౌంటర్లలోను, అన్ని ట్రయిన్‌లకు, అన్ని క్లాసులకు టికెట్లు యిస్తామని గొప్పగా చెబుతారే తప్ప, యివ్వరు. వెనక, ఆయా ట్రయిన్స్‌కి ఆయా కౌంటర్లని నెంబరువారీగా ఉండేది - ఇప్పుడదేమీ లేదు - సర్వం జగ న్నాథం, ఆరోజున వెళ్లే రైళ్లకని కరెంట్ బుకింగ్ పేరుతో రెండు కౌంటర్లు వున్నాయి - 29, 30 అని జ్ఞాపకం. 29 లో ఉన్నాయన తను

యివ్వననీ, 30 లో తీసుకోమనీ అన్నాడు: 'ఎందుకివ్వకూడదు ?' అని ఇద్దరు ముగ్గురు అడగ్గా, ఆయన సమాధానం చెప్పక, నవ్వేసి ఊరుకున్నాడు. కృష్ణమూర్తిగారు నెలకు ఎనిమిదివేలుపైన తెచ్చుకొనే ప్రభుత్వోద్యోగి. అయినప్పటికీ, పగటి ప్రయాణపు ఫస్ట్ క్లాసు టికెట్ కోసం క్యూలో నిలబడక తప్పలేదు, ఆయనకు ముందు సుమారొక పాతిక మంది ఉన్నారు. ఆ నుంచున్నవారు నుంచున్నట్టే తప్ప 'క్యూ' కదలడం లేదు. పదకొండు కావస్తోంది; అయిదు నిముషాలో, పదినిముషాలో వుంది పదకొండుకి. ఇంచుమించు ఈ గంట వ్యవధిలోనూ కదలినది అయిదారుగురు మాత్రమే! కౌంటర్‌లో ఉన్నాయన గ్రాండ్‌గా అనౌన్స్ చేశారు - పన్నెండు గంటల వెస్‌కోస్ట్‌కి బుకింగ్ క్లోజ్ అని! కృష్ణమూర్తిగారితో సూపర్‌వైజర్ రూమ్‌లోకి వెళ్లి 'ఏమిటీ దారుణం ? సమ్‌తింగ్ ఈజ్







రాంగ్ సమ్‌వేర్, పగటిపూట ప్రయాణానికి, ఫస్ట్‌క్లాస్ టికెట్‌కి, గంటసేపు క్యూలో నిలబెట్టి, యింకా అరవై డెబ్బయి నిముషాల టైము వుండగా 'క్లోజ్' అని ఒక్కముక్కలో తేల్చేయడం .... " .... 'ప్లీజ్, కమ్ టు ది కౌంటర్' అని సూపర్‌వైజర్, లోపట్నించి 30వ కౌంటర్ వద్దకు వచ్చి, కౌంటర్ ఉద్యోగిని ఫస్ట్‌క్లాస్ టికెట్ ఒకటి కోయంబత్తూరికి యివ్వమని చెప్పారు. అయితే, కౌంటర్లో ఉన్నాయన తను క్లోజ్ చేశాననీ, 'ఎఫ్' కాబిన్‌లో ఖాళీ ఉన్నదనీ మెయిన్ స్టేషన్‌లో సెకండ్‌క్లాస్ ఓపెన్ టికెట్ తీసుకు, టిసికి చెప్పి, ఎక్సెస్ చెల్లించి, ఫస్ట్‌కాస్‌లో వెళ్లమనీ చెప్పాడు. అంతవరకూ ధన్యులమే! ఇక, రైలులో ఎక్కాక టిసి, ఎక్సెస్ ఫేర్ పుచ్చుకు, రసీదు యిచ్చేందుకు, తనేదో లోకహితార్థమైన పని చేస్తున్నట్టుగా పోజు పెట్టాడట. నోరున్నవాళ్లకే డబ్బూ అధికారమూ వున్నవాళ్లకే యిలా జరుగుతూంటే, సామాన్యుల గోడు వినేదెవరు?

..... 23

యటామిక్ ఎనర్జీ కమీషన్‌కి ఛెయిర్‌మాన్ అయిన యమ్మార్ శ్రీనివాసన్‌ని యిన్నాళ్లూ దూరదర్శినిలోనే చూస్తూ వచ్చాను. ఇవ్వాళ ఆయనని పార్క్ షెరటాన్‌లో స్వయంగా కలుసుకు ఆ ప్రజ్ఞానిధి చెప్పేది వినగల అవకాశం యమ్‌హెచ్‌పి అసోసియేట్స్ వారు కలిగించారు. ఇంజనీరు శాస్త్రి స్వాగతం పలికిన మీదట, 32 సంవత్సరాలు 'ఎటామిక్ ఎనర్జీ' లో పని చేసి రిటైరై, స్వంతంగా టెక్నికల్ కన్సల్టెన్సీ ప్రారంభించిన యమ్‌హెచ్‌పి రావు (హరి ప్రసాదరావు), శ్రీనివాసన్‌ని ఆహుతులకు పరిచయం చేశారు. "జీవితంలోని పరుగు పోటీల్లాటిదే నేటి సాంకేతిక రంగంలో ఉంది. ఈనాటి వైజ్ఞానిక సాంకేతిక రంగంలోని ఇంజనీరింగ్ విభాగానికి గల ప్రత్యేకత, ప్రాముఖ్యతని బట్టే ఆదేశ సౌభాగ్యమూ, సంపదానూ! ఒకప్పటి విద్యుచ్ఛక్తి లాటిదే నేటి అణుశక్తి - అదొక మహాసంపద. ఆ సంపదని సద్వినియోగ పరుచుకోవడం ద్వారానే ఏ జాతి అయినా నిలబడగలుగుతుంది - ముందడుగు వేయగలుగుతుంది. శతాబ్దాలుగా బూజు పట్టిన మన ఆలోచనా పద్ధతులు విడనాడాలి. అణుశక్తి మేదా,అణుయింధన వైజ్ఞానిక ప్రగతి మీద భారత భవితవ్యం ఆధారపడి ఉంది. - అది సాంకేతిక సత్యం" - అన్నారు సూటిగా 'హోమ్ ట్రూత్స్' చెప్పిన శ్రీనివాసన్, - ఆ తర్వాత లంచ్, ఇష్టాగోష్ఠి.

..... 27

నిన్న సాయింత్రం మూడున్నర ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి వచ్చాము హైదరాబాద్. ఎసిస్లీపరులో ఆమెది అయిదూ, నాది పదిహేడూ నెంబరు బెర్తులు. 'మీ కంప్యూటర్ మమ్మల్ని యిలా దూరం చేసింది' - అని చెప్పే

సరికి టిసి నవ్వుతూ 'నేనున్నానుకదా - మాలతీ - చందూర్‌గార్లకు ఒక ఒన్ - అండ్ - టు ఇస్తాను' - అన్నారు. కాబిన్ బావుంది - పక్క ఫస్ట్‌క్లాసులోని డివి నరసరాజుగారిని యిక్కడి తరలిరమ్మన్నాము. పదిన్నరకి ఆయన బాపట్లలో దిగేదాకా విరామంలేని కబుర్లు. నెల్లూరులో గోపాలరెడ్డిగారు మా బోగీలోకి వస్తారనుకున్నాము గాని ఆయన ఫస్ట్‌క్లాసే ప్రిఫర్ చేశారు.... సికింద్రాబాదు స్టేషన్‌కి ఎల్లప్ప (కృష్ణమూర్తిగారి డ్రయివరు) వచ్చాడు. నల్లకుంటలో

As Prescribed in the Registration of Newspapers (Central Rules 1956) - Rule 8 - (Form 18)

## STATEMENT ABOUT OWNERSHIP OF 'JAGATI' (Telugu)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | 2, Kutchery Road<br>Madras - 600 004 |
| 2. | Periodicity of its Publication | Monthly |
| 3. | Printer's Name<br>Whether citizen of India ?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 4. | Publisher's Name<br>Whether citizen of India ?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 5. | Editor's Name<br>Whether citizen of India ?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 6. | Names & addresses of individuals who own the Newspaper | N. R. Chendur<br>Sole Proprietor<br>2, Kutchery Road<br>Madras - 600 004 |

I, N. R. Chendur hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

N. R. CHENDUR
Signature of Publisher

28th Feb. 1989

పదినిముషాలు ఆగి, నారాయణగూడా టాజ్ చేరుకున్నాం - 24 వ నెంబరు రూమ్ మాకోసం రెడీగా ఉంది. ఎల్లప్పని పంపేసి పదకొండుగంటలకి రమ్మనమని చెప్పాము.... హైదరాబాదు ఎందుకొచ్చామంటే, ఈ సాయంత్రం జూబిలీ హాలులో మాలతీ చందూర్‌గారికి, సుశీలా నారాయణ రెడ్డి సాహితీ అవార్డు ప్రదానోత్సవం. 'రసమయి' స్థాపక - కార్యదర్శి యమ్‌కె రాము నెల్లాళ్లక్రితం మద్రాసు వచ్చి, ఈ సంగతి చెప్పినప్పుడు నేను ఒక్కటే అన్నాను: "మేము హైదరాబాదు రావడమంటే రెండువేలవుతుంది - రానుపోను యిద్దరికీ ఎసి స్లీపరు టికెట్లు రు 1500/- (రు 1504); రెండు రోజులు హొటల్‌కి నాలుగైదువందలు - కన్వేయెన్సంటారూ, ఆ యిబ్బంది లేదు, ఫ్రెండ్స్ ఉన్నారు' - అని చెప్పాను.... "అదేమిటండీ - మాకు ఫ్లయిట్ టికెట్స్ పంపించమంటే పంపిస్తాము - ఏ హొటల్‌లో బుక్‌చేయమంటే ఆ హొటల్లో బుక్ చేస్తాం' - అన్నారు రాము... "ఇరవైఏళ్ల పాటు 'ద్వారకా'లోనే దిగుతుండేవారం - ఆ అనుభవం తర్వాత నారాయణగూడాటాజ్ మాకు బాగా నచ్చింది - హొమ్లిగా ఉంటుంది - టివికె శాస్త్రి గారు అక్కడే దిగుతారట.... ఫ్లయిటంటారూ, అంత బిజీ అవలేదు మేము - ట్రయిన్ చాలు" - అని చెప్పాను.... తొమ్మదిన్నరకి రాముగారి వద్ద నుంచి టెలిఫోన్ వచ్చింది. "బ్రహ్మానందరెడ్డి గారిని కలుసుకు మీ వద్దకు వస్తాను" - అన్నారు.... సాయంత్రం సభకు ముఖ్య అతిథి మహారాష్ట్ర గవర్నరు కె బ్రహ్మానందరెడ్డి: అధ్యక్షులు: జస్టిస్ జయచంద్రరెడ్డి.... "మీరు స్వయంగా చూడవలసినవి అనేకం ఉంటాయి. కర్టిసీ కోసం రావద్దు - సాయంత్రం మీటింగులో కలుసుకుంటాం కదా!" అని చెప్పాను రామూగారితో.... వెళ్లవలసిన కొంద రిళ్లకు వెళ్లి, మూడుగంటలవేళ, జవహర్ బాలభవన్ (వాసిరెడ్డి సీతాదేవి) చేరుకున్నాం.... అంతదాకా రథ చోదకుడు ఎల్లప్ప - ఆ తర్వాత శంకర్.... హొటల్‌కెళ్లి, ఫ్రెషెన్ అయి,సీతాదేవితో ఆరుగంటలకిజూబిలి హాలుకి వచ్చాం. సాధారణంగా బయటి వారికివ్వని ఈ హాలు, 'రసమయి' సాహితీ కార్యక్రమానికి ప్రత్యేకంగా యిచ్చారట.... అందరికంటె ముందు వచ్చినవారు పూజ్యులు బెజవాడ గోపాలరెడ్డిగారు - వారు మాకు అత్యంతాప్తులు. వేదిక మీద నుంచి మాట్లాడిన ప్రతి ఒక్కరూ అయన ఉనికివల్ల ఈ సభకు నిండుతనమూ నూతన గౌరవమూ వచ్చిందని అన్నవారే! ప్రార్థనా నంతరం రసమయి అధ్యక్షులు సుధా కిషోర్ స్వాగతం పలికిన తర్వాత. దేవులపల్లి, రామానుజరావు న్యాయనిర్ణేతల (మిగతా ఇద్దరు: ఇల్లిందల సరస్వతీదేవి, కొత్తపల్లి వీరభద్రరావు) పక్షాన, సుశీలా నారాయణరెడ్డి అవార్డ్‌కి మాలతీ చందూర్ ఏ విధంగా అర్హురాలని

తాము భావించినదీ తెలిపారు.... "పందిరి మల్లికార్జునరావు గారింట్లో చూశాను ఆ దంపతులని ముప్ఫయ్యి యిదేళ్ల క్రితం - అప్పట్లో నేనూ మద్రాసువాసినే! మామయ్యని ఆమె ఎలా దబాయిస్తుందో నాకు తెలుసు - అలాగే మామయ్య ప్రభావం ఆమె మీద ఎంత ఉందో కూడా నాకు తెలుసు. అదిగో, ఎదురుగా కూచున్నారు మామయ్య - చందూర్‌గారు. వారింటికి వెళ్లి, ఆ దంపతులతో మాట్లాడుతున్నప్పుడూ, వా రి తో గడుపుతున్నప్పుడూ గంటలు నిముషాలవుతాయి - కాలగమనం తెలీదు. ఎంత సంతోషంగా గడిపాము - అనే అనుభూతి కలుగుతుంది.... ఆమె నవలలన్నీ నేను చదివానని చెప్పలేను - చదివిన కొన్నిటిలోని 'నిర్వేదం'లో దయా సానుభూతి ఉన్నాయి.... మాలతీచందూర్‌కి అసంఖ్యాక అభిమానులు ఉన్నారు" - అని చెప్పారు అవార్డ్ గ్రహీతను పరిచయం చేసిన నాయని కృష్ణకుమారి. సభాధ్యక్షులు జస్టిస్ జయ చంద్రారెడ్డి సుశీలా నారాయణరెడ్డి అవార్డ్ గురించి నాలుగు ముక్కలు చెప్పి, మాలతీచందూర్ పేరు తెలియని వారు లేరన్నారు. ప్రమదావన మాలతీ సుమం, మాలతీ చందూర్‌గా ఒక మినీ ఎన్‌సైక్లొపిడియా అయి, సాహితీలోకాన నవలా చంద్రికలు వెలయించి, తెలుగింటి ఆడపడుచుగా, తెలుగువారి వాత్సల్యానురాగాలు పొందిందన్నారు నారాయణరెడ్డి. తన నింత పెద్ద జేసి గౌరవిస్తున్న రసమయి సంస్థకు, న్యాయ నిర్ణేతలకు, తనపై ప్రశంసలు కురిపించినవారికి, ముఖ్య అతిథిగా విచ్చేసి సన్మానం జరిపిన మహారాష్ట్ర గవర్నరు బ్రహ్మానందరెడ్డి గారికీ, వినయ పూర్వక కృతజ్ఞతలు, మధ్య మధ్య చతురోక్తులతో చెప్పారు మాలతీచందూర్. భారతీయ నాగరికతను కాపాడుతున్నది. పురుషులు కాదు, స్త్రీలేననీ, స్త్రీలు పాటించే పద్ధతులు, సంప్రదాయాలు కారణంగానే, మన సామాజిక వ్యవస్థలు సురక్షితంగా ఉన్నాయనీ అన్నారు బ్రహ్మానందరెడ్డి. (హైదరాబాదుకి రాకపోకల రెండు వేలూగాక, రెండు వేల అయిదువందలు నగదు, కాశ్మీరు శాలువా, ఖరీదైన పట్టుచీరె, పెద్ద సన్మాన పత్రం యిత్యాదులు. ఈ ఖర్చంతా శ్రుతి బిల్డర్స్ - అయన పేరు వెంకట్రావుగారనుకుంటా - పెట్టుకున్నారట). రసమయి కార్యదర్శి యమ్.కె రాము వందన సమర్పణ చేశాక, కృష్ణమూర్తిగారు మమ్మల్ని వారింటికి డిన్నర్‌కి పట్టుకుపోయారు. ఆషాలతా, రామూ మాతో జాయినయారు.... ఎల్లప్ప మమ్మల్ని హొటల్లో దిగబెట్టేసరికి దగ్గిర దగ్గిర పన్నెండు.... శనివారం చార్మినార్‌లో బయలుదేరి, ఆదివారం ఉదయం చేరుకున్నాం మద్రాసు (జనవరి 29). మళ్లీ శుక్రవారం బయలుదేరాలి 'గీటురాయి' ఫంక్షన్‌కి. ఆ కబుర్లు పై నెలలో చెబుతాను.

—యన్నార్ చందూర్

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : సంపన్న కుటుంబంలో జన్మించిన జ్యోత్స్న, డాక్టరు సారథిని యిష్టపడి పెళ్లి చేసుకొన్నది. ఇద్దరు పిల్లలు కలిగారు. భర్త ఎంతో అనురాగం తో చూస్తున్నప్పటికీ, ఆ పల్లెటూరి వాతావరణం ఆమెకి వచ్చడం లేదు. ఏదో శూన్యత ఆమెని ఆవరిస్తోంది .... ఇక చదవండి.

"నీ మనసుకు ఎలాచేస్తే ఊరట కలుతుందో అలాగే కానియ్ జ్యోత్స్నా.... చిన్న చిన్న విషయాలకు బుర్ర బద్దలు కొట్టుకోవడం ఆరోగ్యప్రదం కాదు" అన్నాడు.

జ్యోత్స్న పిల్లలనిద్దరినీ తీసుకొని పుట్టింటికి వెళ్ళిపోయింది. వెళ్ళిన వెంటనే క్షేమంగా చేరినట్టు వచ్చిన ఉత్తరం తరువాత కొన్ని మాసాల ఉత్తరాలు అందలేదు.

సరోవరంలో రేగిన చిరు అలలాగ భార్య మానససరోవరంలో రేగిన తాత్కాలిక అసంతృప్తి సర్దుకొననివ్వడమే అతని ధ్యేయం. అందుకే సారథి కూడా ఉత్తరాలతో జ్యోత్స్నను విసిగించకుండా మిన్నకుండి పోయాడు.

పిల్లలను చూడాలన్పించినపుడు అత్తవారింటికెళ్ళి రెండు రోజులు వారితో గడిపేవాడు. జ్యోత్స్న చిరునవ్వుతో పలుకరించినా ఆ సంబంధ బాంధవ్యాలు కేవలం ఇరువురి స్నేహితుల మధ్యవుండే స్నేహాన్ని మినహా ఇతరత్రా తలపింపచేసేవి కావు.

జ్యోత్స్న మాత్రం సంసార జీవితంలో కృంగిపోయినట్టు కాక, అవివాహితురాలిగా వున్న రోజుల్లో వున్న కళా కాంతులతో, పరిపూర్ణ ఆరోగ్యంతో నిశ్చింతగా పార్టీలకూ, క్లబ్బులకూ వెళుతూ కాలం వెళ్ళ పుచ్చసాగింది. ఓసారి .... సారథి అత్తగారు "ఏం బాబు ! .... ఆ వెధవ గవర్నమెంటు ఉద్యోగం లేకపోతే ఏం .... ఇక్కడికే వచ్చేయకూడదూ ? మాకు మాత్రం.... ఎవరున్నారు ? .... ప్రాక్టీసు ఇక్కడే పెట్టుకుంటే ఆ జీతంరాళ్ళ పాటి రావా ? అమ్మాయి ఆ వెధవ పల్లెటూళ్లో బొత్తిగా బెంగ పడిపోయింది" అంది.... తనేం సమాధానం చెప్పకుండానే మామగారు.... "అల్లుడూ, సంపాదనదేముంది ? మగాడు తలచుకోవాలే గానీ సంపాదనకు లోటుండదోయ్ .... ఎటొచ్చీ సంపాదించాలి అన్నపట్టుదల వుండాలి అక్కడొచ్చే జీతం.... ఇక్కడ ఓరోజులో సంపాదించవచ్చు . రాజీనామా

ఏదో ఇక్కడినుండీ పంపించేయి .... అయినా .... సంపాదన నీ తృప్తి కోసమే !.... నిజానికి సంపాదన బాధ నీ కవసరంలేదు.... లక్షలు సంపాదించాను. ఉన్నది ఇద్దరు కూతుళ్లు.... నాతదంతరం దాకా అవసరంలేదు.... ఇప్పటికీ ఎప్పటికీ అది మీదే .... ఈ వేళ రాసి, రాజీనామా కాగితం పోష్టులో పడేయ్ ...." అని మొదలుపెట్టాడు.

ఆలోచిస్తూంటే అందులో వాళ్ళ తప్పేమి పిసరంతైనా అనిపించడం లేదు. వాళ్ళ ఆలోచనా స్థాయి, ఆపరిధి అలా వుండడంలో తప్పనిపించలేదు. అది వారి మనసుకుతోచిన విషయం.... వారి ఆలోచనా పద్ధతి. ఆ ఇంటి అల్లుడిగా వారి మన్ననలు అందడంలో తప్పులేదు. వారి మాట చెవిని పెట్టడంలో అంతకన్నా పొరపాటులేదు. కానీ.... తన మనసులోని సంఘర్షణ ఎదుటి వారి కర్థం కాదు. వలచి వలపించుకొన్న అందాల రాశి అయిన జ్యోత్స్న, తనవల్ల ఇద్దరు ముద్దు పాపాయిలకు తల్లి అయిన భార్య మనసు తనపట్ల శిలా సదృశమై పోయింది. ఆ చంద్రశిలను కరిగించి సుముఖురాలిని చేసుకోవాలనుకున్నా, మనసులేని కాపురంలో.... మమతలు ఎడమై పోతున్నాయి. మీ అమ్మాయికి నామీద వలపు చల్లారిపోయిందని చెప్పుకోలేని సిగ్గుమాలిన సితి.... వలపుకోసం దేవిరించడమా ? అది తన స్వభావానికే విరుద్ధం ... బలిమిని అనుభవించడం లాటి పశుత్వం తనకు అక్కరలేదు.... తను పశువు కాలేదు. .... అందుకే మనసులోని సుడి గుండాలను మరుగు పరచి. .... "అలాగేనండి .... ఇక్కడికి వచ్చివుండాలన్పించిన ఉత్తర క్షణంలో అక్కడ రాజీనామా ఇచ్చేస్తాను," అని వినయంగా బదులిచ్చాడు.

అతడి గంభీర వదనాన్ని తిలకించిన అత్తామామలు మిన్నకుండిపోయారు. ఆ తరువాత ఎట్టి వత్తిడి చేయలేదు. జ్యోత్స్న మాత్రం.... తన ఫ్రెండ్స్‌తో కలిసి పిక్నిక్‌కి వెళ్ళిపోయింది.

బస్తీకి తిరిగి వచ్చేశాడు సారథి .... దైనందిన కార్యక్రమంలో మార్పు లేదు. కాని మనసు నిండా, రేగిన తేనెతుట్టెలాగ ఒకే ఆలోచనలు.

తమ దాంపత్య జీవితంలో సామరస్యం లోపించినా, తన మనసుకోసం, తన రక్తాన్ని పంచుకు పుట్టిన పిల్లల పట్ల తండ్రిగా తనకున్న కర్తవ్య నిర్వహణం అనే గురుతరమైన బాధ్యత కోసం.... మనసును చెదరనీయలేదు.

సంఘంలో.... భర్త సంరక్షణలేని వివాహిత స్త్రీ అంటే అదో తేలిక భావం! అలాటి పరిస్థితికి జ్యోత్స్న దిగజారాలనుకున్నా ఆమె కోరినంత వరకూ ఆమెకు అండగా నిలబడి సంఘంలో గౌరవస్థానాన్ని నిలబెట్టాలన్న ప్రయత్నం.... జ్యోత్స్నలో మార్పు రావాలని ఎదురుచూస్తూ జీవితాన్ని దర్శించడానికి అలవాటు పడ్డాడు సారథి.

పరిస్థితుల్లో ఏలాటి మార్పు రాకుండానే మరో రెండేళ్లు గడిచిపోయాయి.

ఓరోజు జ్యోత్స్న ఐదేళ్ళ రవిని మూడేళ్ళ విజయనూ తెచ్చి సారధి దగ్గర దిగవిడిచి "సారధీ.... నీ జీవితం లోంచి నేను వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాను. నీకు తెలుసుకదా. నాలోని సౌందర్యం పిపాస ! ఇప్పటికే నీ జీవితాన్ని ఎటూ కాకుండా చేశాను. నీకు విముక్తి కల్గిస్తున్నాను. నీవు కోరిన, నీకనుకూలవతియైన కన్యను పెళ్ళాడి జీవితాన్ని సుఖమయం చేసుకో. నేను .... సుధాకర్‌తో వెళ్ళి .... పోతున్నాను. సుధాకర్ నా అభిరుచికి తగ్గవాడు. మా అభిప్రాయాలు ఒకటి" - అంది .... జంకు గొంకు లేకుండా....

సుధాకర్ ... అనే వ్యక్తితో తనకు పెద్దగా పరిచయం లేకపోయినా, జ్యోత్స్న వాళ్ళింటికి తరచు వచ్చేవాడు. అతడిలో ఏదో ఆకర్షణ వున్నమాట వాస్తవం.... చతుర సంభాషణలో దిట్టం, ఆనడక, ఆశీవి స్త్రీహృదయాన్ని అమాంతం ఆకట్టుకో గలిగిన అభినవ మన్మధుడు.

సుధాకర్‌తో ని నిర్భయంగా చెపుతున్న భార్యపై కోపించాలన్పించలేదు - పెపెచ్చు అభినందించాడు.

"నీలోగల సౌందర్య పిపాస అసమానమైంది జ్యోత్స్నా. అతడి సాన్ని







ధ్యంలో ఎప్పటిలా.... నీలోని జడత్వం ప్రాణం పోసుకొని నీవు మనగలిగితే మంచిదే కదా ? 'గుడ్ లక్, గుడ్ బై'' అంటూ అభినందనలుతెల్పి హాస్పిటల్ వెళ్ళిపోయాడు సారధి.

ఆ తరువాత సారధి గురించి ఆలోచించలేదెన్నడూ.

తల్లినీడలో ఆమె ఆలనపాలనలో విద్యాబుద్ధులు నేర్పి, తండ్రి సంరక్షణలో సుశిక్షితులుగా పెరగాల్సిన పసికందులు, తల్లి ప్రేమకు నోచుకోక, తండ్రీనీడను మిగిలి పోయినందుకు, మనసులో తీరని వ్యధను అనుభవించాడు. ఆ వ్యధను అలాగే గుండెల్లో దాచుకొని నిలబడ్డాడు. పిల్లల ఆలనాపాలనా చూసుకుందుకు ఆయాను ఏర్పాటుచేసి, వారికి తల్లిలేని లోటు తెలియకుండా పెంచడంలో తన దృష్టి కేంద్రీకరించాడు. తల్లి కోసం బెంగ పెట్టుకొని ఏడ్చి మారాం చేసి నానా యాతనపెట్టి తల్లడిల్లి పోతారని భయపడ్డా, ఆభయం అట్టేకాలం నిలువలేదు.

కారణం - రోజూ పిల్లలను పని వాళ్ళ సంరక్షణలో విడిచి క్లబ్బులకు, సినిమాలకు, పిక్నిక్‌లకు వెళ్ళే తల్లికి చేరువ కాలేక పోవడమే ! తల్లిలేక పోయినా మనగలగడం అలవాటయి పోయిన పిల్లలు అనతి కాలంలోనే తండ్రి ప్రేమాభిమానంలో హాయిగా పెరగడం నేర్చుకున్నారు. తన కుటుంబం గొడవలు ఎటువంటి వారికి కాదుకదా కనీసం తల్లికైనా చెప్పుకోవడానికైనా ఇష్టపడని సారది మిన్నకుండి పోయాడు. కానీ ..... దావానలంలా విషయాలు ఊరువాడ దాటి పోయి అటు గాయిత్రి, ఇటు తల్లి పరుగెట్టి వచ్చేట్టు చేశాయి. సారధిని చూచి కంట తడి పెట్టుకుంది తల్లి.

"బాబూ ! ఇంతటితోనే జీవితం ఆఖరవదు. భార్యపోతే మళ్ళీ పెళ్ళి చేసుకొంటున్నట్టు, నీవు తిరిగి అణుకువ, మర్యాదగల సామాన్యురాలిని చేసుకోడం మంచిది. ఆడ దిక్కులేని సంసారం.... సంసారం కాదు. మగవాడి పెంపకంలో పిల్లలు ఎక్కిరారు. నేను చూస్తే కాటికి కాళ్లు చాచుకున్న దాన్ని'' అంటూ కళ్ళొత్తుకుంది....

జ్యోత్స్న.... కలవారి బిడ్డ అవి. అత్తను ముక్తసరిగా పలకరించే మర్యాదేకానీ కలిసిపోలేదు.... అది మనసులో పెట్టుకొని తల్లి సామాన్యురాలిని పెళ్ళాడమని చురక అంటించిందనుకున్నాడు సారధి.

ఇక గాయత్రి మాట చెప్పక్కరలేదు. "అన్నయ్యా ! ఛీ.... ఛీ ... నీవు ఉత్త చవటవురా.... పెళ్ళాం.... మగణ్ణి వదిలేసి వెళ్ళిపోవడం ఎన్నడైనా కన్నామా విన్నామా ? వాలు గంటించి ఇంటికి లాక్కొచ్చి పడేయక - పద వెళ్దాం.... తోడొస్తాను !'' అంటూ ఏదో రూపంగా అన్నలోని పౌరుషాన్ని రెచ్చగొట్ట చూసింది.

నిజానికి గాయత్రికి వదినంటే వల్లమాలిన ప్రేమ, అభిమానం - తొలి చూపులో ఏర్పడ్డ అభిమానం.... జ్యోత్స్న సంసారాన్ని కాలతన్ని వెళ్ళి పోయినా ఆ అభిమానం తరగలేదు....

(ఇంకా వుంది)

JAGATI Telugu Monthly- Vol. 34- No 393- Apr 89
Edited, Printed and Published by N. R. Chendur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras- 600 004